# ఆంధ్రప్రదేశ్







రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా రాజ్ భవన్ లో విందు

1-2-1957 తేదీన ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు తుంగభద్ర నదిపై వంతెనకు శంకుస్థాపన చేశారు. ఈ వంతెన వారణాసి - కన్యాకుమారి అగ్రం జాతీయ రహదారిపై వున్నది.



# ఆంధ్రప్రదేశ్

సంపుటి 1 మార్చి 1957 సంచిక 4

## విషయసూచిక




— చందా —

సాలుసరి రు. 1–8–0 విడిప్రతి 0–2–0

ఆంధ్రప్రదేశ్ సమాచార పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి అజంతా ప్రింటర్సులో ముద్రింపబడినది.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రనిర్మాణం లక్ష్యసిద్ధికి ఒక సాధనమాత్రమే

## ఇక మనం సర్వజన శ్రేయస్సుకై పాటుపడాలి

### గవర్నరు రిపబ్లిక్ దిన సందేశం

రాష్ట్ర గవర్నరు శ్రీ చందూలాల్ త్రివేది రిపబ్లిక్ దినోత్సవంనాడు ఆంధ్రప్రదేశ్ ప్రజలకు సందేశమిస్తూ 'మనం ఏ ఆశయంతో తెలుగు మాట్లాడే ప్రజలందరినీ ఒక రాష్ట్రం క్రిందికి తేవడానికి కృషిచేశామో ఆ ఆశయాలను నెరవేర్చుకొనడానికి ఇప్పుడు శక్తివంచన లేకుండా పాటుపడవలసివున్నది' అని ఉద్బోధించారు.

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ మన లక్ష్యసిద్ధికి ఒక సాధనమాత్రమే. సర్వజనుల శ్రేయస్సౌభాగ్యాలు, భారతదేశ సమైక్యతా సుస్థిరతలే ఇక మన లక్ష్యం అని గవర్నరు అన్నారు.

ఆలిండియా రేడియో హైద్రాబాదు నిలయంనుంచి 1957 జనవరి 26వ తేదీ రాత్రి గవర్నరు ఈ విధంగా సందేశమిచ్చారు:

"ఇది మన అందరికీ శుభదినం. దేశచరిత్రలో మిక్కిలి ప్రధానమైనరోజు. ధర్మనిరతుడు, గౌరవభాజనుడూ అయిన డా. రాజేంద్రప్రసాద్ అధ్యక్షులుగాను, నిత్య యౌవనుడూ, జాతికి ప్రియతముడూ అయిన పండిత జవహర్లాలు నెహ్రూ ప్రధాన మంత్రిగాను వున్నట్టి మన సర్వస్వతంత్ర ప్రజాస్వామ్యదేశం ఏడేండ్లు గడచిన అనంతరం ఎనిమిదవ సంవత్సరంలోకి ఈనాడు అడుగుపెడుతున్నది. భారతదేశ మంతటా ఈరోజు కడు వేడుకతో వైభవోపేతంగా ఉత్సవాలు జరుపబడుతున్నవి. ఈ సందర్భంలో సోదర పౌరులకు, ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ ప్రజలకు సౌహృదయపూర్వక శుభాకాంక్షలు తెలుపుతూ భగవంతుడు ప్రాయంలో చిన్నదైన మన రిపబ్లికుకూ, ఈ రిపబ్లికు ప్రజలు ఆబాలగోపాలానికీ వచ్చేసంవత్సరం శుభం కలుగజేయుగాక అని కాంక్షిస్తున్నాను.

మన రిపబ్లికు సప్తమ వార్షికోత్సవం అనేకవిధాల ప్రాముఖ్యం కలిగివున్నది. మన దేశచరిత్రలో ఇది ఒక మైలురాయి అని చెప్పవచ్చు. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘంవారి నివేదిక ప్రచురింపబడ్డ తరువాత పార్లమెంటులో, రాజ్యసభలో, ఇంకా ఇతర వేదికలమీద ఎన్నో నెలలపాటు చర్చలు, వాదోపవాదాలు జరిగాయి. మన నాయకుల రాజనీతిజ్ఞతవల్ల,ప్రజలు వివేకంతో దేశభక్తిభావంతో వ్యవహరించడంవల్ల రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ పథకం 1956 నవంబరు 1వ తేదీన ఎట్టి ఒడుదుడుకులు లేకుండా ప్రశాంతంగా అమలులోకి తేబడింది. చరిత్రాత్మకమైన ఆరోజున మనదేశంలో కొత్తరాష్ట్రాలు అమలులోకి వచ్చాయి. ఆరోజే మూడుకోట్ల పదిలక్షల ప్రజలు ప్రథమ పర్యాయంగా ఒక రాష్ట్రంక్రిందికి వచ్చి నూతనంగా అభివృద్ధి పథంవైపు పురోగమనం సాగించారు. అదే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం. 1953 అక్టోబరు 1వ తేదీన ఆంధ్రరాష్ట్రానికి ప్రారంభోత్సవం జరిపిన ప్రధానమంత్రే 1956 నవంబరు 1వ తేదీన హైద్రాబాదు విచ్చేసి విస్తృతమైన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి ప్రారంభోత్సవం చేసి మనల్ని ఆశీర్వదించడం మన మహాభాగ్యమని తలుస్తాను.

## ప్రథమ ప్రణాళిక ఫలితాలు

"ప్రథమ పంచవర్ష ప్రణాళిక 1956 మార్చి 31 వ తేదీన ముగిసింది. అనేక రంగాలలో మనం ఆశించినదాని కంటే హెచ్చు ఫలితాలను సాధించాము. వ్యవసాయక, పారిశ్రామిక ఉత్పత్తులు పెరిగాయి. జాతీయాదాయం నూటికి 18 వంతుల చొప్పున పెరిగింది. పౌరుల ఆదాయంలో తల ఒకటికి ఆదాయం నూటికి 11 వంతుల చొప్పున హెచ్చింది. ప్రథమ పంచవర్ష ప్రణాళిక విజయవంతం కావడంచేత మనదేశ ఆర్థికవ్యవస్థ యొక్క పునాది బలపడింది. ఈ ప్రణాళికను అమలుజరుపడంలో మనం ఎంతో అనుభవం గడించడమేగాక మనకు ధైర్యం, ఆత్మవిశ్వాసం కలిగాయి. అంతేగాక ప్రజలలో ఉత్సాహం రేకెత్తించి వారి సహకారాన్నికూడా పొందిన కారణంచేత ప్రజలలో ప్రణాళికపట్ల ఆసక్తి కలిగింది. ప్రణాళికలు అత్యవసరం అనేస్థితికి ప్రజలు వచ్చారు. సక్రమమైన అభివృద్ధి కలుగాలంటే ఏ పరిస్థితులు వుండాలో మనం ఇప్పుడు గ్రహించగలిగాము. భక్రా - నంగాల్, దామోదర్‌వ్యాలీ, కోసీ, చంబల్, నాగార్జునసాగర్, తుంగభద్రా ప్రాజెక్టుల వంటి బహుళార్థ ప్రయోజనకరములైన మన నదీలోయ ప్రాజెక్టులు నిలకడగా పురోగమిస్తున్నాయి. ఒరిస్సాలోని హీరాకుడ్ ఆనకట్టను యీ నెలలోనే ప్రధానమంత్రి ప్రారంభించారు. దీనితో 100 కోట్లు ఖర్చుగల యీ ప్రాజెక్టు మొదటిదశ పూర్తి అయినది. ఈ ప్రాజెక్టు ఒరిస్సా ఆర్థిక వ్యవస్థను పూర్తిగామార్చి, అక్కడి మన సోదర పౌరుల సంక్షేమ సౌభాగ్యాభివృద్ధులకు తోడ్పడుతుంది. సమాజాభివృద్ధులకు తోడ్పడుతుంది. సమాజాభివృద్ధి, జాతీయవికాస సేవా కార్యక్రమాలు స్థిరమైన అభివృద్ధిని సాధిస్తున్నాయి. ఈ అభివృద్ధి కూలంకషమైనది. బొంబాయి సమీపంలోగల ట్రాంబేలో అణుశక్తి సంస్థకు, అణుశక్తి రియాక్టరుకి గడచినవారం ప్రధానమంత్రి ప్రారంభోత్సవం జరిపారు. దీనికి 'అప్సరస' అని పేరు పెట్టబడింది. అణుశక్తి పరిశోధన రంగంలో కొత్త సాధనమైన యీ రియాక్టర్ మన పురోగమనానికి కొలబద్ద. అణుశక్తి అభ్యుదయ సాధనకేకాని యుద్ధంవంటి లేక విచ్ఛిన్నకరమైన ప్రయోజనాలకు యే రూపంలోను వినియోగింప బడబోదని ప్రధానమంత్రి, మన సాంప్రదాయానికి, విధానానికి అనుగుణంగా వాక్రుచ్చారని వేరే చెప్పడం అనవసరం.

ఈ సంవత్సరం దేశవ్యాప్తంగా జరిగిన బుద్ధజయంతి వుత్సవాలు 2500 సంవత్సరాల క్రితం బుద్ధుని బోధనలను, ప్రేమ, పవిత్రత, యీవి, అహింస, విశ్వజనీనమైన సహనము మున్నగు వాటిలో[illegible] మనకు వృద్ధపరచినవి. ప్రపంచానికి అట్టి సందేశం [illegible]రం యిప్పుడు వున్నంత[illegible]వర కెప్పుడూ లేదు.

## రెండవ ప్రణాళిక

'ద్వితీయ పంచవర్ష ప్రణాళికకూడా యీ సంవత్సరమే ఆరంభమయింది. పబ్లిక్‌రంగంలో దీని ఖర్చు రూ. 4,800 కోట్లు. కాని యిది రూ. 5,300 కోట్లకు హెచ్చవచ్చును. ప్రైవేటురంగంలో పెట్టుబడి రూపంలో రూ. 2,400 కోట్లు అవసరం కాగలవని అంచనా. ఈ ప్రణాళిక ఆశయాలు మన కందరికీ బాగా తెలిసినవే, అయినా దాని ప్రధానాశయాలను క్లుప్తంగా చెబుతాను. దేశంలో జీవనప్రమాణాభివృద్ధికై జాతీయరాబడిని 25 శాతం హెచ్చించడం, మూలపరిశ్రమలు, భారీపరిశ్రమలకు ప్రత్యేక ప్రాధాన్యాన్నిస్తూ సత్వర పరిశ్రమాభివృద్ధిని సాధించడం, అత్యధిక సంఖ్యాకులకు వుద్యోగావకాశాలను కల్పించడం, రాబడి, సంపదలలోని తారతమ్యాలను తగ్గించడం, ఆర్థికశక్తిని యెక్కువ సమంగా పంచడం, ప్రణాళిక అమలుకై డబ్బును రాబట్టడంతో తప్పనిసరిగా పొదుపు, పెట్టుబడి, పన్నులు హెచ్చుతాయి.

అంతర్జాతీయ వ్యవహారాలలో, దేశం రిపబ్లిక్‌గా అవతరించిన యీ యేడు సంవత్సరాలలో మనం సంతృప్తికరమైన అభివృద్ధిని సాధించాము.

ఈనాడు ప్రపంచానికి అత్యవసరమైనవి శాంతిభద్రతలు. ముఖ్యంగా పూర్తి అభివృద్ధిచెందని మన దేశంవంటి దేశాల పురోగమనం అదిలేనిదే సాగదు. అయితే దురదృష్టవశాత్తు 1956 వుత్తరార్థంలో అంతర్జాతీయ పరిస్థితులు దిగజారినవి. అప్పటినుంచి ఒక వుపద్రవం తరువాత మరొకటి సంభవిస్తున్నది. సూయజ్ కాలువ జాతీయకరణ, అందుమూలంగా చివరికి ఇంగ్లండు, ఫ్రాన్సు, యిజ్రాయిల్‌లు యీజిప్టుపై సైనిక దురాక్రమణ జరిపిన వుదంతాన్నికాని, హంగరీలోని విషాదపరిస్థితులు, ఆసందర్భంలో రష్యా అవలంబించిన వైఖరి మనకి ఆదుర్దా కలిగించిన విషయాన్నికాని యిక్కడ విపులంగా ప్రస్తావించ నవసరంలేదు. ఈరెండు సందర్భాలలోనుకూడా అమెరికా, తక్కిన ప్రపంచం పూర్తి సహకారంతో ఐక్యరాజ్యసమితి అవలంబించిన దృఢవైఖరే యీ విషాద పరిస్థితులలో ఆశారేఖగా నిలిచినది. ఈ వైఖరివల్లనే యీజిప్టుపై దురా

క్రమణ ఆగిపోయి, యుద్ధవిరమణ జరగడం, యీజిప్టు భూభాగంనుంచి, బ్రిటిష్, ఫ్రెంచి సైనికులను వుపసంహరించడం, ఐక్యరాజ్యసమితి సైనికదళాలను యీజిప్టులో వుంచడం, సూయజ్ కాలువలోని అవరోధాల తొలగింపును ఆరంభించడం జరిగింది. హంగరీలో సమితిచర్య యిదే విధంగా ఫలించకపోవడం విచారకరం. కాని దీనికి బాధ్యులు సమితికాక మరొకరు. మధ్యప్రాచ్యమని ప్రసిద్ధికెక్కిన పశ్చిమ ఆసియాలోని పరిస్థితులు యింకా మిక్కిలి ఆందోళనకరంగానే వున్నాయి. దురాక్రమణను నిరోధించటానికేకాక వివిధ దేశాలలో అలముకునివున్న సందేహ భయ ప్రవృత్తులను పారద్రోలి, ఆయా దేశాలమధ్య శాంతి, సహనం, స్నేహ సౌహార్దాలను పెంపొందించడానికి మిత్రరాజ్యసమితి నైతికస్థాయిని పటిష్ఠంచేయడానికి అన్ని దేశాలు, ముఖ్యంగా అగ్రరాజ్యాలు ప్రయత్నించటమే సక్రమమైన మార్గమనే విషయం సుస్పష్ట మవుతున్నది. మిత్రరాజ్య సమితిలోని సభ్యరాజ్యాలు ఏవిధంగా తలుచుకుంటే ఆవిధంగా ఆసంస్థ రూపొందుతుంది. అతిక్లిష్టమైన పరిస్థితుల్లో చిక్కుకొనివున్న ఈనాటి ప్రపంచంలో సమస్యలను పరిష్కరించి శాంతి సౌఖ్యాలను ప్రతిష్ఠించడానికి ఆ సంస్థను వినియోగించుకోవడం అవసరం.

## ప్రధాని నెహ్రూ అమెరికా యాత్ర

"ఇటీవల మన ప్రధానమంత్రి అమెరికా సందర్శించి అధ్యక్షుడు ఐసెన్‌హోవర్‌తో సంప్రదింపులు జరిపిన విషయం మీకు విదితమే. ఈ సంప్రదింపుల పర్యవసానంగా ఉభయ రాజనీతివేత్తలమధ్య వ్యక్తిగత స్నేహభావం వెల్లివిరిసింది. తద్వారా ప్రపంచాన్ని ఎదుర్కొంటున్న అనేక ప్రధాన సమస్యల పరిష్కారం సందర్భంలో ఈ ఉభయులమధ్య అభిప్రాయాల ఐక్యతకూడా సాధింపబడింది. ఇటువంటి సంప్రదింపులు మన ఉభయ దేశాలకు ప్రత్యక్ష ప్రయోజనకారులుగా పరిణమించడమే గాకుండా పెద్దపెద్ద ప్రపంచ సమస్యల పరిష్కారానికికూడా దోహదకారు లవుతాయని మన దృఢవిశ్వాసం.

గత సంవత్సరంలోవలెనే ఈ సంవత్సరంకూడా అంటే భారత రిపబ్లిక్ సప్తమ సంవత్సరంలో ఇతర దేశాలకు చెందిన ప్రముఖ నాయకులు మన దేశాన్ని సందర్శించారు. ఇథియోపియా చక్రవర్తి, నవచైనా ప్రధానమంత్రి, సిరియా అధ్యక్షుడు మొదలైన విదేశ ప్రముఖులకు ఆతిథ్యం ఇచ్చే భాగ్యం మనకు కలిగింది. ఒకరినొకరు అర్థంచేసుకొనుటలోనూ, పరస్పర స్నేహ సౌహార్దాలు పెంపొందించుకొనుటలోనూ ఈ పర్యటనలు చాలా అమూల్యములైనవి.

మన విదేశాంగనీతి మీ అందరకూ పరిచితమైనదే. ప్రపంచ రాజ్యాలలోని వివిధ వర్గాలతో తటస్థవిధానం మన విదేశనీతికి ప్రాతిపదిక. ఏవర్గానికి చెందినదైనప్పటికీ అన్ని రాజ్యాలు మనకు స్నేహప్రాయములే. మనము ఎల్లప్పుడూ శాంతి, స్నేహ, సౌహార్దరంగాల విస్తృతీకరణకే కృషిచేస్తున్నాము. వలసవిధానంకాని, సామ్రాజ్యతత్వం కాని, ఉపగ్రహరాజ్య నిర్మాణ తత్వంగాని ఏపద్ధతిలోనైనా ఒక రాజ్యముపై మరొకరాజ్యము పెత్తనం చలాయించడానికికాని మనం వ్యతిరేకులము. అంతేకాక మానవజాతి భవిష్యత్తు శాంతియుతమైన సహజీవన విధానంపై ఆధారపడివుందని మన దృఢవిశ్వాసం. అందువల్ల ప్రపంచ ప్రసిద్ధమైన 'పంచశీల' సూత్రాల ఆచరణ ప్రపంచ వ్యాప్తిగా సిద్ధించడమే నిజమైన ప్రపంచశాంతి స్థాపనకు మార్గమని మనం అభిప్రాయపడుతున్నాము.

ఇంతవరకు నేను ప్రస్తావించిన విషయాలు కేవలం మన రాష్ట్రానికి మాత్రమే సంబంధించినవికావు. ఎప్పుడూ కాకపోయినా ఇటువంటి సందర్భాలలోనైనా ఒక ప్రజాస్వామిక దేశంయొక్క పౌరులుగా మనం భారతదేశంలోని వివిధ ప్రాంతాలకు సంబంధించిన విషయాలనే కాకుండా అంతర్జాతీయ వ్యవహారాలను గురించి తెలుసుకోవడం కూడా అలవాటు చేసుకోవాలి. విజ్ఞానశాస్త్రము, సాంకేతిక పరిజ్ఞానమూ అఖండంగా అభివృద్ధి పొందుతున్న యీ యుగంలో ప్రపంచం మనకు అందుబాటులో ఉన్నంత చిన్నదవుతున్నట్లుగా అనిపిస్తున్నది. ప్రపంచంలోని ఒక ప్రాంతంలో జరిగే సంఘటనలు ఇతర ప్రాంతాలమీద కూడా ప్రభావాన్ని ప్రసరింపచేస్తున్నవి. అందువల్ల ప్రపంచంలోని ఏ ప్రాంతంలోనైనా జరుగుతున్న సంఘటనలను ముఖ్యంగా మన దేశంతో రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక స్నేహ సంబంధాలు కలిగివున్న ప్రాంతాలలోని సంఘటనలనుగురించి మనం పట్టించుకోకుండా చూస్తూ ఊరుకోలేము. అంతేకాక ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలోని విధానాలు, సంఘటనలనుగురించిన విజ్ఞానం మనదేశంలోని ఇబ్బందులను, సమస్యలను పరిష్కరించుకొనుటలో మనకు సహాయకారి అవుతుంది. అటువంటి విజ్ఞానం ఎక్కడ లభించినా దాన్ని మనం స్వీకరించాలి. మన ఆలోచనాపరిధిని విశాలం చేసుకొని సమ్యక్ దృక్పథాన్ని

మనం పెంపొందించు కొనుటకేకాక మనజాతి అభ్యుదయ సాధనకుకూడా దానిని వినియోగించుకోవాలి.

## మనరాష్ట్ర పురోగమనం

" ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్నిగురించి పరిశీలిద్దాం. గడచిన సంవత్సరంలో రాష్ట్రమంతటా నేను పర్యటించాను. వ్యవసాయం, నీటిపారుదల సౌకర్యాలు, విద్యుచ్ఛక్తి, సామాజికాభివృద్ధి కార్యక్రమం, అందులో ప్రజలపాత్ర, సాంఘిక సేవా వ్యవస్థలు- ఆంధ్రప్రాంతంలోగాని తెలంగాణాప్రాంతములోగాని ఏరంగంలోచూచినప్పటికీ క్రమంగా పురోభివృద్ధి సాధింపబడుతున్నది. మన మిప్పుడే ఒకక్రొత్త ప్రయాణాన్ని ప్రారంభించాం. ఆంధ్రప్రాంతంకంటే అనేక రంగా లో వెనుకబడివున్న తెలంగాణా ప్రాంతంలో అభ్యుదయ గమ్యోన్ముఖులమై మనం ప్రయాణం చేస్తున్నాం. అభ్యుదయం, అభివృద్ధి ఇతోధిక సాంఘిక సంక్షేమ దివ్యపథములో మన ప్రయాణం కొంతవరకు కష్టంగానూ, దీర్ఘంగానూ సాగవచ్చు. అందువల్ల నిశ్చయంతో ధైర్యంతో, ఉత్సాహంతో శక్తివంతంగా, అభ్యుదయ పథంలో మనం పురోగమించడం మన కర్తవ్యం.

ఆంధ్రప్రదేశ్ పంచవర్ష ప్రణాళిక రూ. 174 కోట్లకు పైగావుంది. మన ప్రణాళికలో వ్యవసాయానికీ, విద్యుచ్ఛక్తి, మేజర్ ఇర్రిగేషన్ పథకాలకు అత్యంతప్రాధాన్యం ఇవ్వబడింది. వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాల్లో సహకారం, సామాజికాభివృద్ధి, పశుసంపద, మైనర్ఇర్రిగేషన్, అడవులు, మార్కెటింగు, పథకములు చేరియున్నవి. వీటికై రూ. 75 కోట్లు ఖర్చుపెట్టబడుతాయి. విద్య, ఆరోగ్యం, వెనుకబడ్డ తరగతుల సంక్షేమంవంటి సాంఘిక సేవా పథకములకు రూ. 34 కోట్లు, పరిశ్రమలకు రూ. 13 కోట్లు (అందులో గ్రామ పరిశ్రమలు, లఘు పరిశ్రమలకు రూ పదిన్నరకోట్లు ఖర్చుపెట్టబడుతాయి) రోడ్లకు రూ. 7 కోట్లు వ్యయపరచ బడుతాయి.

మనది ముఖ్యంగా వ్యవసాయరాష్ట్రం. అందువల్ల అధికంగా వ్యవసాయోత్పత్తిని, ముఖ్యంగా ఆంధ్రలోకంటే తక్కువగా పండు తెలంగాణా ప్రాంతంలో సాధించుటకు అవకాశాలున్నాయి. వ్యవసాయోత్పత్తిని పెంచడం ఎంతో అవసరం. ఎందుకంటే వ్యవసాయాదాయం పెరిగి, తద్వారా జీవనస్థాయి పెరగడమే కాకుండా విద్య, ఆరోగ్యం వంటి సాంఘిక సేవా కార్యక్రమాలను విస్తృతపరచుటకు సాధ్యమవుతుంది. అంతే కాకుండా వ్యవసాయం బాగా అభివృద్ధిచేయడంవల్ల పరిశ్రమాభివృద్ధికి పునాది వేసినట్లు అవుతుంది. వాస్తవంగా చూస్తే ఇంతభారీయెత్తున ప్రణాళిక అమలుకు పూనుకున్నప్పుడు వ్యవసాయాభివృద్ధిని సాధించకపోతే ద్రవ్యోల్బణ పరిస్థితి ఏర్పడే ప్రమాదంవున్నది. ఇందుకై ఎట్టి చర్యలు గైకొనబడుతాయో నేను వివరంగా చెప్పనవసరంలేదు. ఇవి మీకు తెలిసేవుంటాయి. అయితే ఇదిమాత్రం చెప్పదలచాను. ప్రస్తుతం తలపెట్టబడిన పనులపై అదనంగా ఎక్కువ మూలధనం అవసరంలేదు. పల్లెసీమలలో ప్రజలు ప్రగతి చెందాలనీ జీవనస్థాయి పెరగాలనీ కాంక్షిస్తున్నారు. అందుకై మనం దీక్షతో తగు విధంగా కృషిచేయాలి. ఈవిషయంలో జాతీయ విస్తరణ సేవా కేంద్రాలు, సామాజికాభివృద్ధి ప్రాజెక్టులు మనకు లాభా ఉపకరిస్తున్నాయి. ఈ కార్యక్రమాలన్నీ స్వయం సహాయం, పరస్పర సహాయాలపై ఆధారపడి వున్నవి. ఇట్టి కార్యక్రమాలలో ప్రజలు ఎక్కువగా పాల్గొంటున్నారు. అయితే వారి సహకారం ఎంత విస్తృతంగానూ తీవ్రంగానూ వుండాలో అంత లభించడంలేదు. ఈ కార్యక్రమాలన్నీ ఏవో ప్రభుత్వానికి సంబంధించినవి మాత్రమేనని భావించుకోకుండా ప్రజలు తాము చేస్తున్న కృషికి ప్రభుత్వం తగు ప్రోత్సాహమిచ్చి సాధ్యమైనంతవరకు ఆర్థికసహాయం చేయగలదని భావించాలి. పైనించి కిందివరకు ప్రజలు, ప్రభుత్వ యంత్రాంగం కలిసి మనం తలపెట్టిన కార్యాలను సాధించాలి. తక్కువ అభివృద్ధిచెందిన దేశంలో ప్రగతి సాధించడం అంత సులభమైన పనికాదు. నిజం చెప్పాలంటే కష్టపడంది ఫలితం దొరకదు, శ్రమించి పనిచేయనిదే ప్రగతి సాధించలేము. మన ప్రణాళిక విజయవంతం కావాలంటే అన్ని తరగతుల ప్రజలు అన్ని రంగాలలోను కొన్నేండ్లపాటు నిరంతరం కృషిచేయాలి. మనంచేసే పనిలో క్రమశిక్షణ, ఐకమత్యం, పట్టుదల వుండాలి. ఆంధ్రప్రదేశ్లో ప్రతి ఒక్కరూ ఈ లక్ష్యసాధనకై కృషి చేయగలరని మనస్ఫూర్తిగా ఆశిస్తున్నాను. వ్యక్తులనూ, జాతులనూ తయారుచేసే గుణగణాలు ఇవే.

ఈ సందేశంలో ఆంధ్రప్రదేశ్ అవతరణనుగూర్చి ప్రస్తావించినాను. ఆనందోత్సాహాలలో మనం ఈ వేడుకను జరుపుకున్నాము. తెలుగు ప్రజల నందరినీ ఒక రాష్ట్రం క్రిందికి తెచ్చుటకై మనం చేసిన కృషికి జీవంపోసిన వున్నతాశయాలను సఫలీకృతం చేయుటకు మనం పని చేయాలి. రాష్ట్రాల పునర్విభజన అనేది ఆశయసిద్ధికి ఒక

(మిగతా 8 వ పేజీలో)

# ప్రతి నెల ఒక అణా మిగిల్చి రెండవ పంచవర్ష ప్రణాళికకు రూ. 12 కోట్ల ధన సహాయం చెయ్యండి

## ఆంధ్రప్రదేశ్ ప్రజలకు ముఖ్యమంత్రి విజ్ఞప్తి



ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రెండవ పంచవర్ష ప్రణాళికకు రు. 174.5 కోట్ల ఖర్చు తలపెట్టబడింది.

ఈ విషయమై రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ఆలిండియా రేడియో హైద్రాబాదు నిలయంనుంచి ప్రసంగిస్తూ ప్రణాళికలో చేయబడిన ముఖ్యమైన కేటాయింపులను విశదీకరించి, ప్రజాసహకారం ఏయే అంశాలకు లభించాలో వాటిని ఇల్లా పేర్కొన్నారు :-

(అ) సామాజికాభివృద్ధి, (ఆ) ప్రజోపయోగకరమైన పథకాలకు వేతనాలు తీసుకొనే పనివారల సమీకరణ, (ఇ) శ్రమదానమునకు ప్రోత్సాహం, (ఈ)మద్యనిషేధం, (ఉ) కల్తీవ్యాపారాలు మొదలగు అసాంఘిక చర్యలను అరికట్టుట, (ఊ) అవినీతి నిరోధన, (ఋ) పారిశుధ్యపు పని, (ౠ) సహకారోద్యమం.

ఆంధ్రప్రదేశ్ పౌరులలో ప్రతి ఒక్కరు నెలకొక అణా మిగిల్చి తద్వారా ప్రణాళికను అమలు జరుపడానికై ఏటా రు. 2.4 కోట్ల ధన సహాయం చేయవలసిందిగా ముఖ్యమంత్రి విజ్ఞప్తి చేశారు.

"ప్రథమ పంచవర్షప్రణాళిక ప్రాథమికలక్ష్యం వైవిధ్యం గల, అభ్యుదయకరమైన ఆర్థిక వ్యవస్థకు పునాదులు వేయడమే. దేశంలో ఆహారధాన్యాలు, ముడిసరుకుల కొరత ఏర్పడి, ద్రవ్యోల్బణం నానాటికీ హెచ్చుతున్న రోజులలో ప్రథమ ప్రణాళిక సిద్ధం చేయబడింది. ప్రథమ ప్రణాళికలో సాధింపబడిన ఫలితాలు చెప్పుకోదగినవే అయినప్పటికీ ఆ ప్రణాళిక మన ఆర్థిక వ్యవస్థలో చైతన్యం కలిగించి భౌతికంగా శ్రేయస్సుసు ఒనగూర్చడానికి చేయబడిన ప్రథమ ప్రయత్నం మాత్రమేనని చెప్పవలెను. ఆహారధాన్యాల కొరత, ముడిసామగ్రి కొరత, ద్రవ్యోల్బణం మొదలగు సమస్యలను మనం తక్షణమే పరిష్కరించుకోవలసివచ్చింది. అయితే ప్రథమపంచవర్షప్రణాళిక, భవిష్యత్తులోత్వరితగతిని అభివృద్ధిని సాధించడానికి నాంది ప్రస్తావనగానే ఉద్దేశించబడింది. ఆర్థిక వ్యవస్థలోని సమస్యలను దీర్ఘకాలిక అవసరాల దృక్పథంతోనే ఆలోచించడమైనది. తక్షణావసరాలను తీర్చడానికీ, సర్వతోముఖమైన ఆర్థికాభివృద్ధికి కృషిని ప్రారంభించడానికీ అభివృద్ధి కార్యక్రమాలు రూపొందించబడ్డవి. ప్రథమ ప్రణాళిక కలిగించిన చైతన్యంవల్ల దేశ ఆర్థిక వ్యవస్థలో కదలిక, మార్పు మొదలయింది. వ్యవసాయోత్పత్తి, పారిశ్రామికోత్పత్తి బాగా హెచ్చింది. ప్రథమ ప్రణాళికకు నిర్ణయించబడ్డ ప్రధానలక్ష్యాలు పూర్తిచేయబడ్డవి. కొన్ని లక్ష్యాలను అధిగమించడంకూడాజరిగింది. ఆ అయిదేళ్లలో 170 లక్షల ఎకరాల భూమికి సాగునీరు లభింపజేయబడింది. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి 23 లక్షల కిలోవాట్లనుంచి 34 లక్షల కిలోవాట్లకు పెరిగింది. రైల్వేల పునరుద్ధరణ పనికూడా చాలావరకు జరిగింది. పబ్లికు రంగంలో, ప్రైవేటు రంగంలో అనేక పరిశ్రమలు నెలకొన్నవి. జడమై చేతనా రహితమై పడివున్న దేశంలో నవోత్తేజం కలుగ

నారంభమైంది. ప్రథమ ప్రణాళిక ముగిసేనాటికి జాతీయాదాయం నూటికి 18 వంతుల చొప్పున పెరిగింది. మొదట నూటికి 11 వంతుల చొప్పున మాత్రమే జాతీయాదాయాన్ని పెంపొందించాలని తలపెట్టబడింది.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక 1-4-1956 తేదీన ఆరంభమైంది. ప్రథమ ప్రణాళికలో సాధింపబడిన ఫలితాలను ప్రాతిపదికగా పెట్టుకొని అభివృద్ధి కృషిని కొనసాగించవలసి వున్నది. ప్రణాళికను సిద్ధపరచడంలో మూడవ, నాల్గవ ప్రణాళికలను కూడా ఊహించుకొని విశాలమైన దృష్టితో ప్రతిపాదనలు చేయబడ్డవి.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికకు కేంద్ర రాష్ట్రప్రభుత్వాలు కలిసి మొత్తం రూ. 4,800 కోట్లు ఖర్చుపెట్టవలెనని తలపెట్టబడింది. ప్రథమ ప్రణాళిక ఖర్చు రూ. 2,356 కోట్లు, అంటే ప్రథమ ప్రణాళిక ఖర్చుకంటే ద్వితీయ ప్రణాళిక ఖర్చు రెట్టింపుకంటె కొంచెం ఎక్కువగానే వున్నదన్నమాట. ద్వితీయ ప్రణాళికకు రాష్ట్రప్రభుత్వాలు రూ. 2,241 కోట్లు ఖర్చుపెట్టవలసి వున్నది. ప్రథమ ప్రణాళికకు రాష్ట్ర ప్రభుత్వాలు పెట్టిన ఖర్చు రూ. 1,457 కోట్లు మాత్రమే. ద్వితీయ ప్రణాళికకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి రూ. 174.5 కోట్ల వ్యయం కేటాయింపబడింది. ఈ మొత్తంలోనుంచి ఆంధ్ర ప్రాంతానికి రూ. 119 కోట్లు, తెలంగాణాకు రూ. 55.5 కోట్లు కేటాయింపబడ్డవి.

## వ్యవసాయానికి హెచ్చు ప్రాధాన్యత

భారతజాతీయ ప్రణాళికలో ఆంధ్రప్రదేశ్ ప్రణాళిక ఒక భాగం. పైన పేర్కొన్నవే ఈ ప్రణాళిక లక్ష్యాలు కూడా. ఈ రాష్ట్రానికి అనువైనరంగాలలో అభివృద్ధిని త్వరితగతిని సాధించే ఉద్దేశంతోనే ప్రణాళిక రచించబడింది. భారీ అభివృద్ధి పనులకై ఆంధ్ర ప్రదేశ్ రెండవప్రణాళికలో తలపెట్టబడిన ఖర్చుల పంపిణీ విధానాన్ని చూచినట్లయితే వీటికి జాతీయ ప్రణాళికలో ఎంత ప్రాముఖ్యం చూపబడిందో విశదమవుతుంది. వ్యవసాయం, సామాజికాభివృద్ధికయ్యే ఖర్చులకు ప్రణాళికలో ఐదేండ్లకాలంలో రూ.39.25 కోట్లు కేటాయించబడినవి. ప్రథమ ప్రణాళికలో వ్యవసాయ కార్యక్రమాలకు అత్యధిక ప్రాధాన్య మివ్వబడింది. ఆంధ్ర ప్రదేశ్‌లో వ్యవసాయం ప్రధాన గ్రామపరిశ్రమ. ప్రజలకు ఇదే జీవనాధారం. కనుక రెండవ ప్రణాళికలో దీనికి తగు ప్రాధాన్యత ఇవ్వబడింది. జనాభా శీఘ్రంగా పెరగడం, పరిశ్రమలు ముడిపదార్థాల సరఫరాకు వ్యవసాయంపైన ఆధారపడడం, ఎగుమతికి పదార్థాలు మిగులుగా ఉండునట్లు చేయుట అవసరంకావడం, జాతీయాదాయం పెరుగుతున్న ఫలితంగా, సహజంగా యెక్కువవుతున్న వినిమయ పరిస్థితిని ఆదుకోవలసి రావడం మున్నగు కారణాలవల్ల వ్యవసాయానికి అతిప్రాముఖ్యం ఇవ్వాలి. కనుక రెండవ ప్రణాళిక, మొదటి ప్రణాళికకన్నా, వ్యవసాయం, పరిశ్రమల అభివృద్ధి ఒకదానిపైన ఒకటి సన్నిహితంగా ఆధారపడివుండాలని సూచిస్తున్నది.

ప్రణాళికలో నీటివనరులు, విద్యుచ్ఛక్తి అభివృద్ధి ఖర్చులకు రూ. 76.23 కోట్లు కేటాయించబడినవి. కృష్ణానదిపై రూ. 122 కోట్ల ఖర్చుతో బహుళార్థసాధక నాగార్జునసాగర్ ప్రాజెక్టుపై మొదటిదశ పని ఇదివరకే ఆరంభించబడింది. ఇది మూడో ప్రణాళిక కాలంలో పూర్తికాగలదని ఆశించబడుతున్నది. ఇదేగాక కృష్ణా రెగ్యులేటరు–రోడ్డు వంతెన, భైరవానితిప్ప ప్రాజెక్టు, రాళ్ళపాడు, తుంగభద్రలో లెవల్, హై లెవల్ కాలవలు, రాజోలిబండ డైవర్షన్ స్కీము మున్నగు ముఖ్య ప్రాజెక్టులలో కూడా పని చురుకుగా కొనసాగుతున్నది. వచ్చేసంవత్సరం వంశధారప్రాజెక్టుపైన కూడా పనిఆరంభింపబడుతుంది. విద్యుదుత్పాదక శక్తికూడా పెంచబడుతుంది. ఇందుకై ప్రణాళికలో మాచ్‌ఖండ్, తుంగభద్ర, సీలేరు జలవిద్యుచ్ఛక్తిపథకములు, రామగుండం థర్మల్ పథకంలాంటి ముఖ్యమైన విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు చేర్చుకోబడినవి.

## పారిశ్రామికాభివృద్ధి

జాతీయ ప్రణాళికలో కేటాయించబడిన భారీ పరిశ్రమలేగాక రాష్ట్రప్రణాళికలో మధ్యరకం, లఘు, గ్రామపరిశ్రమల అభివృద్ధికి కూడా రూ. 13.36 కోట్లు కేటాయించబడినవి. ఆర్థిక ప్రగతికి పరిశ్రమలు, ఖనిజములు అభివృద్ధిచెందడం అవసరం. అయితే దురదృష్టవశాత్తు ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికంగా వెనుకబడివున్నది. అన్నిప్రాంతాలు తుల్యంగా అభివృద్ధి సాధించాలనీ, ప్రాంతీయాభివృద్ధిలో ప్రస్తుతంగల అసమానత్వాన్ని చక్కదిద్దవలెననీ కేంద్రం తలపోస్తున్నందువల్ల ఆంధ్రప్రదేశ్‌లో కొన్ని భారీ పరిశ్రమలు నెలకొల్పుటకు మన రాష్ట్రం చేసిన ప్రతిపాదన అంగీకరించబడగలదని ఆశింపబడుతున్నది. ఈ విషయం ఇదివరకే కేంద్రప్రభుత్వ దృష్టికి తీసికొని రాబడింది. ప్రస్తుతపు గ్రామీణపరిశ్రమలు వాటి పరిస్థితిని కుదుటపర్చుకొని సాంకేతిక విషయములను అభివృద్ధిపరచుకొని తద్వారా ఉత్పత్తిని

హెచ్చించే దృష్టితో రాష్ట్రప్రణాళికలో కొన్ని లఘుపరిశ్రమలు, కుటీరపరిశ్రమల సత్వరాభివృద్ధికై శ్రద్ధ వహించబడింది. ప్రణాళికలో సహకార చక్కెర ఫ్యాక్టరీల స్థాపన, రాజమండ్రిలోని ఆంధ్రా పేపరుమిల్లుల విస్తృతీకరణ అభివృద్ధి, గూడూరులోని పింగాణీ ఫ్యాక్టరీ విస్తృతీకరణ, సింగరేణి బొగ్గుగనులు, ప్రాగాటూల్సు కార్పొరేషనుల విస్తృతీకరణకు సంబంధించిన కార్యక్రమములు చేర్చుకోబడినవి. తెలంగాణాలో న్యూస్‌ప్రింటు ఫ్యాక్టరీని నెలకొల్పే విషయమై వివరాలు అంతిమంగా తయారుచేయబడుతున్నవి.

ప్రణాళికలో వ్యవసాయం, నీటివనరులు, విద్యుచ్ఛక్తి పరిశ్రమలేగాక రవాణా సౌకర్యాల అభివృద్ధి ఖర్చుకై రూ. 7.7 కోట్లు. సాంఘిక సేవక్రింద రూ. 34.43 కోట్లు కేటాయించబడినవి. సాంఘిక సేవలో విద్య, వైద్యం, ప్రజారోగ్యం, నీటి సరఫరా, పారిశుద్ధ్యం, మహిళల సంక్షేమం, నిమ్నజాతులు, నిమ్న తరగతులు మున్నగువారికి చెందిన అభివృద్ధి పథకములు చేరియున్నవి. ప్రణాళికలో ఇతర అంశముల క్రింద అంటే ఆంధ్రప్రదేశ్ రాజధానిని అభివృద్ధి పరచుట, అభివృద్ధికార్యక్రమములను చేపట్టుటకు మునిసిపాలిటీలకు, ఎన్నుకోబడిన పంచాయితీలకు అప్పులు ఇచ్చుట, కమ్యూనిటీ రేడియోసెట్టులు సరఫరా చేయుట మున్నగువాటికొరకు రూ. 2.68 కోట్లు కేటాయించబడినవి.

ప్రజల సహకారాన్ని స్వీకరించే అనేక పథకాలు, కార్య నిర్వహణ రంగాలు ద్వితీయ ప్రణాళికలో చేర్చబడివున్నవి. జాతీయ విస్తరణ సేవా కార్యక్రమాలు, సామూహిక వికాస కార్యక్రమాలు ప్రజలు స్వయంగా పాల్గొని సహకరించటానికీ, స్వయంకృషి చేయటానికీ అనుకూలమైన రంగాలు. మనగ్రామాలు అభివృద్ధి చెందవలెనంటే, యీకార్యక్రమాల కంటే ప్రజా సహకారాన్ని పొందటానికి యోగ్యమైన కార్యక్రమాలు మరేవీ వుండవు. ఈ కార్యక్రమాలు అప్పుడే మనరాష్ట్రంలో నాల్గవవంతు ప్రాంతానికి వ్యాపించినవి. ద్వితీయ ప్రణాళిక చివర కాలానికి వీటిని రాష్ట్రమంతకు వ్యాపింప జేయాలని మనం సంకల్పించాం. ప్రజలు పాల్గొని సహకరించటానికి అవకాశంకల యితర కార్యక్రమాలు పథకాలుకూడా యింకా చాలావున్నవి. ఇరిగేషన్ వగైరా పబ్లిక్‌వర్క్సులో వేతనాలపై పనిచేయటానికి కార్మికులను సమీకరించుట, శ్రమదానాన్ని ప్రోత్సహించుట, మద్యనిషేధం అమలు పరచుటలో ప్రజా సహకారాన్ని సాధించుట, అవినీతి నిర్మూలన, కక్షీవ్యాపారం మొదలైన సంఘ వ్యతిరేక దురాచారాల నిర్మూలన కార్యక్రమాలలో ప్రజలను సమాయత్తపరచుట, దేశవ్యాప్తంగా పారిశుద్ధ్య ప్రచారోద్యమం, గ్రామీణ, స్వల్ప పరిశ్రమల వ్యవస్థా నిర్మాణం మొదలైన వివిధ రంగాలలో ప్రజలు సహకరించటానికి అవకాశాలున్నవి.

## ప్రణాళిక నిర్వహణకు ఆర్థికస్తోమత

రాష్ట్ర ప్రణాళికా నిర్వహణకుగల ఆర్థిక అవకాశాలను గురించి ఒకమాట చెప్పవలసి వుంది. మొత్తం ఖర్చు రు. 4800 కోట్లలో, రు. 2220 కోట్లు ప్రభుత్వాలు ఖర్చు చేయవలసి వుంటుంది. రాష్ట్ర ప్రభుత్వాల ఆదాయ అవకాశాలు అవసరమైన దానికంటె తక్కువస్థాయిలో వున్నవనే విషయం అందరికీ తెలిసిందే. రాష్ట్ర ప్రభుత్వాలను సంప్రదించి, ప్లానింగ్ కమిషన్‌వారు చేసిన పరిశీలననుబట్టి, ద్వితీయ ప్రణాళిక కాలంలో రాష్ట్ర ప్రభుత్వాలు ఇప్పటి తమ ఆదాయాలలోనుంచి సుమారు రు. 225కోట్లు మాత్రం ప్రణాళికా నిర్వహణ నిమిత్తం ఖర్చు చేయగలుగుతవని తేలింది. పన్నుల విచారణ సంఘంవారి సిఫార్సులదృష్ట్యా యీ విషయంలో ఏయే పద్ధతులద్వారా ఆదాయం రాబట్టవలసి వుంటుందో చాలావరకు ఆలోచించటం జరిగింది. రాష్ట్ర ప్రభుత్వాలు రు. 160 కోట్ల వరకు అదనపు పన్నులు విధించటానికి కూడా అంగీకారం తెల్పినవి. ప్రణాళికకాలం 5 సంవత్సరాలలోను యింకా సుమారు 65 కోట్ల వరకు ధనం స్వీకరించవలసి వస్తుంది.

ఆంధ్రప్రదేశ్‌రాష్ట్రానికి రు.174.5కోట్ల ఖర్చుకాగల ప్రణాళికను నిర్వహించటం ఏమంత సులభమైన విషయంకాదు. కొంతవరకు సహాయం చేయవలసిందని కేంద్రాన్ని మనం అభ్యర్థించి నప్పటికి, మన అవకాశాలను మనం పటిష్టంగా భద్రపరచుకొని వాటినివినియోగించు కోటానికి ప్రయత్నించవలసి వుంటుంది. మన ప్రణాళికకు పునాది ప్రజాసహకారం, ప్రజాభిప్రాయం, ఇవే మనల్ని నడిపించే ప్రధాన శక్తులు, ప్రణాళిక విజయానికి మూలకారణాలు. గడచిన కొలది సంవత్సరాల్లో ప్రజలవద్దకు వెళ్లగానే, అందరూ ప్రణాళికను ఆదరణతో స్వీకరించారు, సహకరించారు. ప్రణాళికలోని పథకాలలో పెట్టుబడిగా వినియోగించుకోటానికి మన ప్రభుత్వానికి ఉన్న వసతులే చాలా తక్కువ. నిలువధనం రూపంలో ఎక్కువగా లేనేలేదు. అందువల్ల ప్రజలనుండి ఋణాల ద్వారానూ, డిపాజిట్ల ద్వారానూ, మన ప్రభుత్వం ఎంతవరకు ధనాన్ని సేకరించ

గలుగుతుందో, దానిపైనే ఎక్కువగా ఆధారపడవలసి వుంటుంది.

అందువల్ల ప్రణాళిక నిర్వహణలో సమస్త ప్రజానీకం తమ సహకారాన్ని యిక ముందుకూడా ఇవ్వవలసిందిగా మీకు విజ్ఞప్తి చేస్తున్నాను. ప్రతివారూ డబ్బు మిగుల్చుకొని, కూడబెట్టుకునే అలవాటును పెంపొందించుకోవాలి. రాష్ట్ర మంతటా పొదుపరితనం వృద్ధిపొంది, తద్వారా రాష్ట్రీయ అభ్యుదయానికి సుగమమైనమార్గం ఏర్పడాలి. ప్రతివ్యక్తికీ లభించే విరామ సమయాన్ని ప్రణాళిక నిర్వహణ కార్యక్రమాలకై వినియోగించుకోవాలి. ఆంధ్రప్రదేశ్‌లోని ప్రతి పౌరుడు నెలకు ఒక అణావంతున దాచిపెట్ట గలిగితే, ప్రతి సంవత్సరం మనకు రు. 2.4కోట్ల ధనం లభిస్తుంది. సేవింగ్స్ ఉద్యమంలో ప్రతివారు పాల్గొనుట అత్యవసరం. ధనసేకరణ వసతులను అభివృద్ధి చేసుకొనే దృష్టితోనే కాకుండా, ప్రతి కుటుంబానికి ప్రణాళికా సందేశాన్ని అందించే కార్యక్రమంలో యీ సేవింగ్స్ ఉద్యమం అతి ప్రధానమైన పాత్ర నిర్వహించగలుగుతుంది. కాబట్టి యీ దృష్ట్యా కూడా యీ వుద్యమాన్ని ప్రజలు ఆదరించి, పాల్గొనాలి. ప్రతి వ్యక్తి చైతన్యవంతుడై, ముందుకు సాగనిదే మన రాష్ట్రం పురోగమించలేదు. అందువల్ల దేశీయ, రాష్ట్రీయ పునర్నిర్మాణ మహాయజ్ఞంలో మనం అందరం పాల్గొనిమనసర్వశక్తులను అభ్యుదయానికి అంకితంచేద్దాం."



## ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర నిర్మాణం లక్ష్యసిద్ధికి ఒక సాధన మాత్రమే

[4 వ పేజీ తరువాయి]

మార్గంమాత్రమే. అహింసాయుతమైన, శాంతియుతమైన ప్రజాస్వామికపద్ధతితో సర్వప్రజలకూ శాంతి సౌఖ్యములను కల్పించడమే మన పరమావధి. ఆంధ్రప్రదేశ్ పురోగమనానికి పాటుపడడంలో మనకు హక్కువుంది. అయినా భారత సమైక్యతను పెంపొందించుటకు సదా కృషిచేయాలి. ఈ విషయంలో అనుమానాలకూ, అసూయకూ, సంకుచిత భావాలకూ తావు వుండకూడదు. పొరుగు రాష్ట్రాలతో, ప్రజలతో సన్నిహిత సంబంధాలు వుండాలి. మనదేశపు ప్రతి భాగంలో ఏకత్వభావం వుండాలి.

మనం ముందు చేయాల్సింది చాలావుంది. తొమ్మిదేండ్ల క్రితం స్వరాజ్యం సంపాదించుకున్నాము. రాజకీయంగా మనదేశం బాల్యదశలోవుంది. అయితే నైతిక, ఆధ్యాత్మిక విలువలు గల మన సంస్కృతీ నాగరికతలు అతి ప్రాచీనము లయినవి. ఆర్థిక ప్రగతీ, అభివృద్ధీ మనదేశానికి అత్యవసరం. అయితే ఇట్టి ప్రగతి సాధించడంలో మనం ఎల్లప్పుడూ నైతిక ఆధ్యాత్మిక విలువల ప్రాముఖ్యతను మనస్సులో వుంచుకోగల మని నేను విశ్వసిస్తున్నాను.

మీ అందరికీ సముష్టిగానూ, వ్యక్తిగతంగానూ నా శుభాకాంక్షలు తెలుపుతున్నాను."



# ఆంధ్రప్రదేశ్ చేతిపరిశ్రమలు

## ప్రభుత్వంచేస్తున్న ఆర్థిక సాంకేతిక సహాయం

> ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం వివిధ చేతిపరిశ్రమలకు ప్రసిద్ధిజెందినది. ఇట్టి చేతిపరిశ్రమల పనివారలను సహకార పద్ధతులపై సమీకరించి ఆయా పరిశ్రమల అభివృద్ధికి దోహదంచేసే వాతావరణాన్ని కలిగించడానికై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అవసరమైన చర్యలు గైకొంటున్నది.
>
> నీలం సంజీవరెడ్డి
> *ముఖ్యమంత్రి*

### బొమ్మల పరిశ్రమ

ఆదిలాబాదు జిల్లాలో బొమ్మల పరిశ్రమ చాలా ముఖ్యమైనది. ఈ పరిశ్రమ నిర్మల్‌లో కొన్ని తరాలనుంచి వర్ధిల్లుతూ వున్నది. ఇచ్చట బూరుగు, పునుకు కర్రతో బొమ్మలు ఆటవస్తువులు తయారు చేయబడుతున్నవి. చింతగింజలను నానబెట్టి వాటిని ఆరనిచ్చి, తరువాత పైపొరతోసహా రుబ్బి, అందులో నీరుపోసి జిగురు అగునట్లుగా ఉడకబెట్టి, ఆ జిగురును బొమ్మలభాగాలను అతికించడానికిఉపయోగిస్తారు.

నిర్మల్ ఆటవస్తువులలో పళ్ళికలు, పెట్టెలు, చెస్‌సెట్లు, పేకలు, స్క్రీన్ పేనెల్సు, జంతువుల, పక్షుల, కూరగాయల పండ్ల నమూనాలు మొదలగునవి యెన్నో ఉంటాయి.

ఇటీవల నిర్మల్ పరిశ్రమ అభివృద్ధి సరచబడినది. హైద్రాబాదులోని "నిర్మల్‌పరిశ్రమ" అను సంస్థకు ఇండస్ట్రియల్ ట్రస్టుఫండునుండి లక్షరూపాయలు సహాయంగా ఇవ్వబడినవి. ఈ సంస్థపై ఒక మేనేజిమెంటుబోర్డు అజమాయిషీ వహిస్తున్నది. నిత్య జీవితావసరాలకు పనికివచ్చే వస్తువులు, అలంకారప్రాయమైన వస్తువులుకూడా ఈ పరిశ్రమలో తయారవుతున్నవి. ఇది ముఖ్యంగా చెప్పుకోదగిన అభివృద్ధి. పళ్ళికలు, ట్రేలు, లాంతరుస్తంభాలు, చుట్టసిగరెట్ పెట్టెలు, ఆడవారి బూట్ల మడిమెలు, భోజనం చేయడానికి ఉపయోగపడే సెట్లు, కొవ్వువత్తులు పెట్టుకొనే స్టాండులు, అగరువత్తుల స్టాండులు, బరిణెలు, కొయ్యసామగ్రి మొదలగు కడు ఆకర్షణీయమైనవస్తువులు తయారు చేయబడి మార్కెట్లలో విక్రయించబడుతున్నవి. నిర్మల్ పరిశ్రమలో చక్కని డిజైనులేగాక మరొక ప్రత్యేకత ఏమిటంటే వనమూలికల పసరు ఉపయోగించి వస్తువులకు మంచి మెరుగు పెట్టబడుతుంది. ఆ మెరుగు ఎన్ని రోజులు గడచినా చెడదు.

నిర్మల్ బొమ్మల పరిశ్రమలో ఇటీవల మరొక అభివృద్ధి సాధించబడింది. అదేమిటంటే బొమ్మలు, వస్తువులు



నక్కపల్లి బొమ్మలు

తయారుచేసే పనివారలకు ఇంకా అభ్యుదయకరమైన శిక్షణ ఇవ్వబడుతున్నది. అంతేగాక నిర్మల్‌లో ఒక సహకార సంఘంకూడా నెలకొల్పబడింది. ఈ రెండింటివల్ల ఈ పరిశ్రమ చక్కని పునాదులపై నిలుచుటకు అస్కారం కలుగుతుంది. ఇందుకొరకై భారత ప్రభుత్వం రూ. 16,600 లు గ్రాంటుగాను, రూ. 10,000 లు అప్పుగాను ఇచ్చింది. ఈపథకంక్రింద వంశపారంపర్యంగా ఈవస్తువులను తయారుచేయు పనివారలకు స్టయిపండ్లుఇచ్చి ఆరునెలలపాటు శిక్షణ ఇవ్వబడింది. శిక్షణ ముగిసిన తరువాత వారు సొంతంగా ఒక పారిశ్రామిక సహకార సంఘమును ఏర్పాటు చేసుకున్నారు. ఆ సంఘముయొక్క పెట్టుబడికొరకై వాణిజ్య పరిశ్రమల శాఖ రూ. 5,000 లు అప్పుగా ఇచ్చింది.

## కొండపల్లి బొమ్మల పరిశ్రమ

కృష్ణాజిల్లాలోని కొండపల్లిలో తయారయ్యే బొమ్మలు తెల్లపొనుకు కొయ్యతో చేయబడుతాయి. ఈ కొయ్యను ఏ ఆకారంలోనికైనా మార్చుటకు వీలవుతుంది. ఈ కొయ్యతో పక్షులు, బొమ్మలు పౌరాణిక విగ్రహములు చేయబడుచున్నవి. తెల్లపొనుకుకొయ్య స్థానికంగానే లభిస్తుంది. అటవీశాఖ బొమ్మలు తయారుచేయు పనివారలకు కోపులను ప్రత్యేకించి వుంచి వారికి తగ్గింపు ధరలకు టన్ను 15 రూ. 10 లకు ఇస్తుంది. 'ఆర్య క్షత్రియులు' అను తెగకుచెందినవారు ఈ పరిశ్రమను నడుపుచున్నారు. వీరు రాజస్థాన్‌నుంచి వలస వచ్చినవారు. ఇప్పుడు ఈ పరిశ్రమలో 15 కుటుంబాలవారు పనిచేస్తున్నారు. 1936 సం. లోనే ఒక సహకార సంఘం స్థాపించబడింది. ఈ సంఘం బొమ్మలు తయారుచేయు సభ్యులకు అవసరమైన ముడి సరకులు, పరికరములు సరఫరాచేసి, ఆ తరువాత వారివద్దనుంచి బొమ్మలు తీసుకొని వాటిని విక్రయిస్తుంది. అఖిలభారత చేతివస్తువుల సంఘం ఇటీవలనే ఈ సంఘానికి పెట్టుబడి ధనం క్రింద రు. 5000 మంజూరుచేసింది. అభివృద్ధికరమైన పద్ధతులలో బొమ్మలు తయారుచేయడంలో శిక్షణసౌకర్యాలు కల్పించుటకై రూ. 9,150 లు ఖర్చుకాగల పథకం ఒకటి ఇటీవలనే మంజూరైనది. ఈ బొమ్మలకు గిరాకీ చాలా యెక్కువగా



కొండపల్లి బొమ్మలు

వున్నందువల్ల కొండపల్లిలోని 'సహకారసంఘం' కళాకారులు బొమ్మలను అధిక సంఖ్యలో ఉత్పత్తిచేసి సరఫరా చేయలేక పోవుచున్నారు. ఇందుకు వలసిన మూలధనం, తగినంతమంది కళాకారులు లేక పోవడమే ముఖ్యకారణం. కొండపల్లి చరిత్రాత్మకమైన స్థలం. కనుక ఇక్కడికి అనేక మంది యాత్రికులు వస్తూంటారు. అందుకని ఇక్కడ తయారైన బొమ్మలు ఎప్పటి కప్పుడు అమ్ముడు పోతాయి. ఉత్పత్తిని పెంచుటకై అవసరమైన చర్యలు తీసుకోబడుతున్నవి.

## తిరుపతి (తిరుచానూరు) బొమ్మల పరిశ్రమ

అనాదిగా వస్తున్న కొయ్యబొమ్మల పరిశ్రమలో తిరుపతి బొమ్మలు చాలా ప్రసిద్ధి వహించినవి. ఇందులో దేవతలు, మనుషులు, జంతువుల బొమ్మలు సంప్రదాయ పద్ధతులలో తయారు చేయబడుచున్నవి. సంప్రదాయరీతి సౌందర్యంవల్ల ఈ బొమ్మలకు మంచి గిరాకీవుంది. ముఖ్యంగా తిరుపతిలో ఉత్సవ సమయాలలో ఈ గిరాకీ హెచ్చుగా ఉంటుంది. ఈ బొమ్మలపై కొందరు వర్తకులు, మధ్య దళారీలు మాత్రమే గుత్తపెత్తనం వహిస్తున్నారు. వీటిని తయారుచేసిన కళాకారులు తమ వస్తువులకు నామమాత్రమైన ధరలను మాత్రమే పొందగలుగుతున్నారు. ఢిల్లీలోని అఖిలభారత చేతివృత్తుల సంస్థకు సంబంధించిన అధికార్లు ఈ ప్రదేశానికి వచ్చి ఇక్కడి కళాకారుల కష్టనిష్ఠూరాలను విచారించారు. వాణిజ్య పరిశ్రమల శాఖవారు రూ. 26000ల ఖర్చుతో, కళాకారుల పిల్లలకు శిక్షణ సౌకర్యాలను కల్పిం

చుటకూ, ఒక ఉత్పత్తి-శిక్షణకేంద్రాన్ని ప్రారంభించుటకూ ఒకపథకాన్ని సంకల్పించారు. ఇందులో సంప్రదాయసిద్ధమైన బొమ్మల తయారీకి ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. ఈ పథకం అమలుపరచబడుతున్నది. ఈ బొమ్మలకు కెనడా, అమెరికా సంయుక్త రాష్ట్రాలలోకూడా మంచి గిరాకీ ఉన్నది.

## ఏటికొప్పాక లక్క బొమ్మలు

విశాఖజిల్లా సర్వసిద్ధి తాలూకా ఏటికొప్పాకలో లక్క రంగు బొమ్మల పరిశ్రమ ఉన్నది. ఈపరిశ్రమ పూర్వం చాలా అభివృద్ధిలో ఉండేది. కాని ప్రస్తుతం క్షీణదశలో ఉంది. ఇక్కడి బొమ్మల పరిశ్రమకు కావలసిన సామగ్రి మెత్తని మేలురకం కర్ర - రంగువేస్తే బాగా అతుక్కునే కర్ర. స్థానికంగా ఇటువంటికర్ర లభ్యమవుతుంది. ఇక్కడ తయారయ్యేవస్తువులు, మైసూరులోనిచెన్నపట్నంగ్రామంలో తయారయ్యే వాటిలాగానే ఉంటాయి. ఇక్కడ తయారయ్యే బొమ్మ సామానులో ప్రేలు, ఎద్దులు, రైలుఇంజను రకాలు గ్రామఫోన్లు, పండ్లు, ఇతరత్రా పిల్లలు ఆడుకోటానికి పనికి వచ్చే సామానులు ఉంటాయి. ఈపరిశ్రమ ప్రస్తుతం మధ్య దళారీల చేతుల్లో ఉంది. ఇక్కడి బొమ్మల ఉత్పత్తి ప్రక్రియలో సాంకేతిక అభివృద్ధి తీసుకురావటం అవసరం. డిజైన్లలో మార్పులుకూడా అవసరం. ఈ పరిశ్రమాభివృద్ధికై, ఒక ఉత్పత్తి-శిక్షణ కేంద్రం స్థాపించే పథకం ఇటీవలనే ప్రారంభించ బడింది.

గుడివాడ సమీపంలో గల గ్రామాలలో మట్టిబొమ్మల పరిశ్రమ, కాగితం యంత్రపరికరాలపనులుకూడా గమనించ దగినవి.

## తివాచీల పరిశ్రమ

వరంగల్లు తివాచీలు దక్కనుప్రాంతానికి గర్వకారణాలు. 1857 లో లండన్‌లో జరిగిన బ్రిటిష్ సామ్రాజ్య ప్రదర్శనలో ప్రదర్శింపబడిన రగ్గులలో వరంగల్లు రకాలు చాలా ప్రసిద్ధి వహించినవి. వీటిని 'దక్కన్ రగ్గు' అని వ్యవహరిస్తారు. సిల్కు, కాటన్, వులెన్ దారంతో వీటిని తయారుచేస్తారు. ఉలెన్ రగ్గులు, 'గలాచె' అనే పేరుగల తివాసీలు, రంగు పూలు వుండలు అల్లబడతాయి. వీటిమీద పర్షియాదేశ సంబంధమైన డిజైన్లు చిత్రించబడుతవి. వీటికి స్థానికంగా ప్రజల్లో అభిరుచి ఉంది. స్థానికంగా లభ్యమయ్యే ఊలుతో డిజైన్ల రంగుపథకాలు తయారుచేసుకోబడుతాయి.

ఈ పరిశ్రమను పునరుజ్జీవింపజేయటానికై, వాణిజ్య పరిశ్రమల శాఖవారు వరంగల్లులో ఒక పథకాన్ని అమలు



*వరంగలు, ఏలూరు తివాచీలు*

పరచుటకై ఇండియా ప్రభుత్వంనుండి రూ. 60,000 ల ఋణసహాయాన్ని పొందారు. ఈ ఋణధనం వరంగల్లు కుటీర, స్వల్ప పరిశ్రమల సంఘంవారికి ఇవ్వబడినది. ఈ సంఘంవారు 1955 డిసెంబరునుండి ఉత్పత్తి ప్రారంభించి, రూ. 49,256-9-0 ల విలువగల 1825 తివాచీలు తయారు చేశారు.

ఇటీవల బొలారంలోని రాష్ట్రపతి నిలయంలో వరంగల్లు తివాచీలు అమర్చబడినవి.

## ఏలూరు తివాచీలు

పశ్చిమ గోదావరిజిల్లా ముఖ్యపట్టణం ఏలూరు ఉలెన్ తివాసీల నేతకు చాలా ప్రసిద్ధి వహించినది. 15 వ శతాబ్దం మధ్యకాలంనుండి ఇక్కడ ఈ పరిశ్రమ భారీఎత్తున కొన సాగింపబడుతున్నది. వీటిలోఉపయోగించేఊలు స్థానికంగా దొరికే రకమే. దీనిని గొల్లవారివద్దనుండి సేకరిస్తారు. ఇక్కడి గొర్రెలు, మేకలు జిల్లాలోని మెట్టతాలూకాల్లో ఉంటవి. వాటినుండి లభ్యమయ్యేఊలు తివాచీలకు ఉపయోగిస్తారు. స్థానికంగా ఇటువంటి ఊలు 82,000 పౌనులవరకు దొరుకుతుంది. ప్రక్కనేగల తెలంగాణా ప్రాంతంలోని జిల్లాలనుండికూడా ఈ పరిశ్రమకు ఊలు సేకరించబడుతుంది. 1937 లో 150 మంది సభ్యులతో ఏలూరు తివాసీ నేత పారిశ్రామిక సహకారసంఘం స్థాపించబడింది. సహకారసంఘం వెలుపలకూడా అనేకమంది తివాసీ ఉత్పత్తిదార్లు ఉన్నారు. సంవత్సరానికి తివాసీల ఉత్పత్తి 25,000 చదరపుగజాలు ఉంటుందని అంచనా. తివాసీలవెల చదరపు గజం 1 కి రూ. 12-8-0 నుండి రూ. 30 ల వరకు ఉంటుంది. ఢిల్లీలోని ఇండియన్ స్టాండర్డ్ ఇన్‌స్టిట్యూషన్ వారివల్ల ఇక్కడికి తగిన ప్రమాణాలు నిర్ణయింపజేసే కార్యక్రమానికి ప్రభుత్వం ప్రయత్నాలు ప్రారంభించింది. ఈ ప్రయత్నాలు ఇప్పుడే తుది స్వరూపాన్ని పొందినవి.

ఇటీవల ఇక్కడి తివాసీలు, తగినంత మేలురకం ఊలు లభించని కారణంచేత నాణ్యతలో కొంత దెబ్బతిన్నవి. ఈ ఇబ్బందిని తొలగించటానికి, ఉత్పత్తిదారులకు ప్రాసెస్ చేసిన రంగువూలు సప్లయి చేయటానికి ఉద్దేశించబడి. రూ. 4 లక్షలు ఖర్చుకాగల ఒకపథకాన్ని అమలుపరచాలని వాణిజ్య పరిశ్రమలశాఖవారు తలపెట్టారు. ఈ పథకానికి ఆర్థికసహాయం చేసే నిమిత్తం ఈ పథకం అఖిలభారత చేతి వృత్తుల సంస్థవారికి పంపబడింది. ఏలూరులో వూలును ప్రాసెస్‌చేసి, రంగువేసే కేంద్రాన్ని ప్రారంభించటానికి కూడా సంకల్పించబడింది. ఉత్పత్తిని కేంద్రీకృతం చేసే ఆలోచనకూడా ఒక పథకరూపంలో కొనసాగుతున్నది.

> ఏలూరు, వరంగల్ తివాచీలు, ఏటికొప్పాక, కొండపల్లి, తిరుపతి, నిర్మల్ బొమ్మలు, హైద్రాబాదు బీదు హిమ్రూలు, కరీంనగర్ వెండి నగిషీపని, తాటికర్రతో తయారు చేయబడు పూళ్ళ చేతికర్రలు, బందరు కలంకారీ అద్దకం, పోచంపల్లి చీరెలు, ఇతర అద్దకపు వస్త్రములు మొదలగు ఆంధ్రప్రదేశ్ చేతిపరిశ్రమలు సుప్రసిద్ధమైనవి. వీనిలో కొన్ని భారతదేశంలోనే కాక విదేశాలలో కూడా బాగా అమ్ముడు పోతున్నవి.
>
> వి. బి. రాజు
>
> వాణిజ్య పరిశ్రమల, కార్మిక శాఖామంత్రి.

## అద్దకం వస్త్రాలు

దక్కనులో అతి ప్రాచీనమైన చేతివృత్తులలో ఎరుపు, నలుపు రంగులలో చేనేతవస్త్రాల అద్దకం పరిశ్రమ ప్రధానమైనది. ఇది యావద్భారత దేశంలోనూ ప్రసిద్ధిచెందినది. నల్లగొండజిల్లాలోని పోచంపల్లి 'తేలియారుమాళ్లు' గ్రామీణుల వస్త్రధారణంలో చాలా ముఖ్యమైన భాగంగా చెలామణి అవుతున్నవి. ఈ పద్ధతి చాలా కష్టమైనది, సున్నితమైనది కూడా. భారతదేశంలో చాలా కొద్ది ప్రాంతాల్లో మాత్రమే ఈకళ ఇంకానిలిచివున్నది.

వంశపారంపర్యంగా రంగుల అద్దకం చేస్తున్నవారికి అభివృద్ధికరమైన విధానాలలో శిక్షణ ఇచ్చుటకునూ, వారి సాంకేతిక పరిజ్ఞానాన్ని పెంపొందించుటకునూ వారిలోని సృజనాత్మక శక్తులకు దోహదం చేయుటకునూ, వాణిజ్య పరిశ్రమల శాఖవారు రూ. 26,594 ల ఇండియా ప్రభుత్వ ఆర్థికసహాయంతో ముషీరాబాద్‌లో ఒక గ్రామపరిశ్రమల శిక్షణకేంద్రాన్ని స్థాపించారు. బ్లీచింగ్, డైయింగ్, ప్రింటింగ్ పనులలో 20 మంది విద్యార్థులకు శిక్షణ ఇవ్వబడింది. ఇతర విధానాలతోపాటు పోచంపల్లి టై అండ్ డై నేతవిధానంకూడా వారికి నేర్పబడింది. ఈ పద్ధతిమీద చేనేత పారిశ్రామిక సహకార సంఘంవారు తయారు

చేస్తున్న చీరెలు, వాకిలి కర్టెనులు, ఇతర వస్తువులకు మార్కెట్‌లో మంచి గిరాకీ ఉంది.

## కలంకారీ పరిశ్రమ

స్థానికంగా లభ్యమయ్యే వనమూలికల రంగులతో వస్త్రాలకు రంగులు వేయటం, ప్రింటింగ్ వగైరా పనులను కలంకారీ అద్దకాలు అంటారు. అనాదినుండి ఈ పరిశ్రమ మచిలీపట్నంలో కొనసాగింపబడుతున్నది. రంగులు అద్దబడుతున్న స్త్రా .. మూడురకాలు.

1. బ్లాకుప్రింటులు. 2. బ్లాకు ప్రింటులు, చేతి అద్దకం. పూర్వం ఈ పరిశ్రమలలో షుమారు 200 కుటుంబాలు నిమగ్నమై పనిచేస్తుండేవి. కాని ప్రింటింగ్ రకాలకు స్థిరమైన మార్కెట్ లేనందువల్ల ఈ పరిశ్రమకు కొంత దెబ్బ తగిలి అనేకమంది పనివారలు ఈ వృత్తి వదలిపెట్టవలసివచ్చింది.

ఈ పరిశ్రమను పునరుద్ధరించేసంకల్పంతో, అఖిలభారత చేతివృత్తుల సంఘంవారు మచిలీపట్నంలోని బయ్యాల గూడెం సహకార క్రయవిక్రయ సంఘంవారికి రూ 5,000 లు మంజూరు చేశారు. ఈ సంఘంలోని సభ్యులందరూ ప్రింటింగ్‌పనులు చేస్తూంటారు. కేంద్ర సంఘం సహాయంతో ఈ సంఘం వారు ఈ వృత్తిలో కళాకారులకు శిక్షణ కేంద్రాన్ని నిర్వహించారు. ఇంకా అనేకమంది కళాకారులకు శిక్షణ ఇవ్వవలసి ఉన్నది. అంతేగాక ఈ వస్త్రాలకు మార్కెట్లనుకూడా సాధించవలసి ఉన్నది.

## జరీ చీరెలు

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం జరీ చీరెలకు ప్రసిద్ధివహించినది. నారాయణవరం, ఉప్పాడ, గద్వాల ఈ విషయంలో కొన్ని ముఖ్య కేంద్రాలని చెప్పవచ్చు. కొన్ని ఉతుకులు పడిం తర్వాత చీర కొన్నిచోట్ల మందమై మరికొన్నిచోట్ల పల్చన అయి, ఆ విధంగా నేతపనితనం చెడిపోకుండా ఉండేటట్లుగా అవసరమైన చర్యలు తీసుకోవలసి ఉన్నది.

## చాపల అల్లకం పరిశ్రమ

మహబూబ్‌నగర్‌జిల్లా ఎనుగుండలో 'బుడు' లని వ్యవహరింపబడే ఒక తెగవారు సున్నితమైన చాపల నేత పరిశ్రమలో ప్రసిద్ధులు. ఈ పరిశ్రమను సహకారపద్ధతుఃపై అభివృద్ధి చేయుటకై, ఎనుగుండ గ్రామంలో వాణిజ్య, పరిశ్రమల శాఖవారు ఒక పథకాన్ని ప్రారంభించారు. ఇందుకై ఇండియా ప్రభుత్వమునుండి రూ. 3,250 లు ఆర్థిక సహాయం లభించింది. ఈ పథకానికై పూర్వ హైదరాబాదు ప్రభుత్వం రూ. 650 లు మంజూరు చేసింది.

చాపల నేతపనివారి సహకార సంఘం ఒకటి ప్రారంభించబడింది. ఈసంఘం 1955లో తన కార్యక్రమాలను ప్రారంభించింది.

## దంతము, కొమ్ము వస్తువుల పరిశ్రమ

దంతపు వస్తువుల తయారీ మరొక ప్రధానమైన పరిశ్రమ. ఈ పరిశ్రమలో తయారవుతున్న వస్తువులలో ముఖ్యమైనవి: 1. లాంప్ స్టాండ్ 2. దంతపు నగలు 3. దేవతల బొమ్మలు 4. దంతపు దువ్వెనలు 5. దంతపు వీణమెట్లు 6. పౌడరు డబ్బాలు 7. చుట్టలు సిగరెట్ల కేసులు 8. అగ్గిపెట్టె కేసులు 9. కాగితంకోసే సామగ్రులు 10. దంతపు గుండీలు, ఉంగరాలు, గొలుసులు వగైరా ఇతరసామాన్లు.

ఈ వస్తువులను ప్రపంచంలో అందరూ ప్రశంసిస్తున్నారనీ, వాటి వాడకం క్రమేణా హెచ్చుతున్నదనీ స్థానిక ప్రదర్శనలు, అంతర్జాతీయ ప్రదర్శనల నుంచి వచ్చిన వార్తలు తెలుపుతున్నాయి.

## విశాఖపట్నపు దంతం, కొమ్ము పరిశ్రమ

విశాఖపట్నం చక్కని దంతపుపనికి ప్రసిద్ధికెక్కినది. దంతపు బరిణెలు, ఫొటోఫ్రేములు, విజిటింగుకార్డులపెట్టెలు మున్నగునవి ఇక్కడ చేయబడతాయి. అప్పటి కలక్టరైన మిస్టర్ ఫానే 1859–62 మధ్య యీ పరిశ్రమను ప్రవేశపెట్టాడని చెబుతారు. ఈ పరిశ్రమను సహకార పద్ధతిలో నడిపించడానికి కృషి చేయబడుతున్నది.

## గాజులు, గాజుపూసల పరిశ్రమ

గాజులు, గాజుపూసల పరిశ్రమ ఆంధ్రదేశంలో వర్ధిల్లుతున్నది. చిత్తూరు జిల్లాలోని పాపానాయుడుపేటలో వలె ఇక్కడ మంచినాణ్యమైన గాజుపూసలు తయారుచేయబడుతున్నాయి. కొంతకాలంక్రితం పాపానాయుడుపేటకేంద్రాన్ని దర్శించిన స్వీడన్‌దేశపు గాజుపరిశ్రమ నిపుణుని అభిప్రాయం గమనార్హమైనది. అతడు ఆంధ్రదేశాన్ని పర్యటించి పాపానాయుడుపేటను దర్శించడానికి ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నాడు. ఆధునికయంత్రాల సహాయం లేకుండా అంత వున్నత ప్రమాణంగల గాజుపూసలను అక్కడి చేతి పనివారు యెలా తయారుచేయగలుగుతున్నారో స్వయంగా పరిశీలించడానికై ఆయన పాపానాయుడుపేట సందర్శించాడు.

చిత్తూరుజిల్లాలోని కాళహస్తి, పాపానాయుటపేటలు, అనంతపురం జిల్లాలోని గుట్టూరు, విశాఖపట్నంజిల్లాలోని సింహాచలం, మహబూబ్‌నగర్ జిల్లాలోని గాజులపేట యీ పరిశ్రమకు ముఖ్యమైనకేంద్రాలు. మొదట కాళహస్తిలో ప్రారంభింపబడిన శిక్షణాకేంద్రానికి విద్యుచ్ఛక్తి సరఫరా అయ్యేది కాదు. ఆధునిక యంత్రాల వినియోగానికి ఇది చాల ముఖ్యమైనది. అందుచేత 1954 లో అది గుట్టూరుకి తరలించబడింది. ఇక్కడ గాజులు, గాజుపూసల తయారీలో శిక్షణ ఇవ్వడానికి మంచి సౌకర్యాలు ఉన్నాయి. ఈ కేంద్రంలో 15 మందికి శిక్షణ ఇవ్వబడుతున్నది. ఒక్కొక్కరికి నెలకి రూ.25స్టయిపెండుఇవ్వబడుతున్నది. రేణిగుంట, గుట్టూరు, సింహాచలములలో మరి మూడుశిక్షణకేంద్రాలు ప్రారంభింపబడినవి. రేణిగుంటలో 6 గురు విద్యార్థులు శిక్షణ పొందుతున్నారు. ఒక్కొక్కరికి నెలకు రూ. 15 ల స్టయిపండు ఇవ్వబడుతుంది. గుట్టూరులో గాజులుతయారుచేయబడుతవి. సింహాచలంలో గాజులు, గాజుపూసల తయారీలో శిక్షణకు సౌకర్యాలున్నవి. మహబూబ్‌నగర్‌లో కూడా ఇటువంటిదే మరొక కేంద్రం పనిచేస్తున్నది.

## వెండి నగిషీపని

కరీంనగరంజిల్లా అత్యుత్తమమైన చక్కని వెండినగిషీ పనికి చాలా కాలంగా ప్రసిద్ధికెక్కినది. ఇందులో స్థానిక కంసాలుల అతిసున్నితమైన పనితనం ప్రదర్శితమవుతుంది. ఈనాడు ఇది అరుదైనచేతివృత్తి. ప్రజ్ఞావంతులైన కొందరు వృత్తిపనివారు, కంసాలులు మాత్రమే దీనిని చేయగలరు. వారు అతిసన్నని వెండితీగతో పనిచేస్తారు. తీగలను అల్లి అద్వితీయమైన అత్యంత సున్నితమైన డిజైన్లను తయారు చేస్తారు. ఈ పరిశ్రమలో ఇంచుమించు 150 మంది చేతిపని వారు పనిచేస్తున్నారు. ఈపరిశ్రమలో ఉపయోగింపబడే పని ముట్లు చాలా సాధారణమైనవి. ఆష్‌ట్రేలు, గాజులు, తమల పాకుల పెట్టెలు, బ్రోచీలు, బొత్తాలు, బటిణెలు, సిగరెట్ల పెట్టెలు, పువ్వులవాజ్‌లు, పతకాలు, కాగితంచింపే సాధనాలు, ఫోటోఫ్రేములు మున్నగునవితయారుచేయబడతాయి. ఈ పరిశ్రమను సహకార పద్ధతిలో నడిపించడానికి ఒక ప్రణాళిక రూపొందించబడింది. దానిఖర్చు రూ. 40,600. ఆర్థిక సహాయం నిమిత్తం అది కేంద్ర ప్రభుత్వానికి పంపించబడు తున్నది.

## బీదరీ వస్తువులు

బహమనీరాజుల పరిపాలన కాలంలో, ఆరాజుల ప్రోత్సాహంవల్ల బీదరీవస్తువుల పరిశ్రమ దినదినాభివృద్ధి చెందింది. దీనికి పారసీక దేశంతో సాంస్కృతిక, కళాత్మకమైన సంబంధంవుంది. అందుకనే అరేబియా, పారసీకదేశాలలో గల ప్రాచీన కళతోపాటు దీనికి ఉభయ సామాన్యమైన



*నరసాపురం క్రొచెట్ లేసు చేతిపని*

చరిత్రవుంది. ఆవేళాలలో ఉక్కుపైనగాని లేక రాగిపైన వాసి. వెండిబంగారములు పొదుగబడి వుంటాయి. అయితే ఇక్కడమాత్రం ఉక్కు లేక రాగికి బదులుగా కొద్ది నిష్పత్తులో తుత్తునాగము, రాగి, ఇతర ధాతువులు కలసిన నల్లని సీసపు రంగుగల మిశ్రమధాతువు ఉపయోగించ బడుతుంది. ఈమిశ్రమ లోహానికి త్రుప్పుపట్టదు సరికదా చెడిపోదుకూడా.

ప్రప్రథమంలో ఈ మిశ్రమ లోహంతో పళ్లెములు, నీళ్ళకూజాలు, హుక్కాలు, మైనపు వత్తి సెమ్మెలు, సుగంధ ద్రవ్యములు, పరిమళ ద్రవ్యములు, భద్రపరచు పెట్టెలు, పళ్లెరములు, పూల వ్యాజులు మొదలగునవి తయారు చేయబడేవి. ఈమిశ్రమ లోహంతో తయారు కావింపబడిన నీళ్ళగిన్నెలకు ఎక్కువగా గిరాకీ వుండేది. ఇందులో పోసిననీటికి కొన్ని రోగనివారక గుణములు కలుగుతాయని ఒక విశ్వాసము కలుగడమే దీనికి కారణము. ఇప్పుడు చుట్ట, సిగరెట్టుపెట్టెలు, ట్రేలు, వ్యాజులు, చేతిబొత్తాలు, గుండీలు, పండ్లుపెట్టుకొనే గిన్నెలు కూడా తయారు చేయబడుతున్నాయి.

బీదరీ వస్తువులపై వేయబడు చిత్రాలు సాధారణంగా బీదరులోని చరిత్రాత్మక కోటనుంచి, ప్రపంచఖ్యాతి నొందిన అజంతా చిత్తరువులనుంచి గ్రహింపబడినవే. అనేక ఆధునిక డిజైన్లు ఇప్పుడిప్పుడు వేయబడుతున్నవి.

బీదరీ వస్తువుల పనితనం అద్భుతమైంది. ఈ వస్తువులను గురించి ప్రొఫెసర్ స్పెయిట్ ఇలాఅన్నాడు, "వాస్తవంగా బీదరీ వస్తువులు అద్భుతమైన పనితనము కలిగి వున్నాయి, ఇవి మైసూరు, కాశ్మీరుల కొయ్యపని, మద్రాసు కాశీల లోహపుపని, తిరువాన్కూరు దంతపు నగిషీపని, నేపాలు సెమ్మెలు, పూజాపాత్రల పనితనంతో తులతూగగలవు. ఒక ప్రమాణబద్ధమైన కేటలాగునుకూడా యీ శాఖ వారు ప్రకటించారు."

హైద్రాబాదు నగరంలో నాలుగు బీదరీ వస్తువుల సహకార సంఘాలు పనిచేస్తున్నారు.

## హిమ్రూ పరిశ్రమ

హిమ్రూ వస్త్రములు నేయడం చాలా గొప్పవిద్య. ఇవి ప్రత్తినూలుతో, ఆకర్షణీయమైన కృత్రిమ పట్టుపోగులతో దట్టమైన రంగులతో రకరకాల డిజైనులతో నేయబడుతాయి. ఇవి స్త్రీల రవికెలకు, సాయంత్రం వేసుకొనే కోటులకేకాక పర్దాలు మొదలగు వాటికికూడ పనికివస్తాయి; లేతరంగులు గలవాటిని అచ్ఛతలకు ఉపయోగించవచ్చును.

హిమ్రూ వస్త్రం నానావర్ణ రంజితమై వుంటుంది. పేక నూలును ఎక్కువగా వేసి, దట్టంగా నేయడంవల్లనే ఇది కడు అలంకార ప్రాయంగా తయారవుతుంది. డిజైనులను తీర్చి దిద్దడం, చారలు, వంపులు, వివిధరంగులలో శోభాయమానంగా నేయడం, పోగులన్నిటినీ కడుచమత్కారంగా పరిపూర్ణడం పనితనాన్ని, కళాభినివేశాన్ని తెలియజేస్తాయి. అయితే నేతమాత్రం కొద్దిగా దట్టంగా వుంటుంది. ప్రతి చదరపు గజంలో వీటి బరువు మూడునుంచి ఐదు ఔన్సుల వరకు వుంటుంది. హిమ్రూ వస్త్రములలో ఒక్కొక్క అంగుళములో 280 పోగు లుండడము సాధారణమైన విషయం.

అయితే ఈ పరిశ్రమ త్వరగా పతనం చెందడానికి యంత్రములతో తయారైన వస్త్రముల పోటీ, ప్రజల అభిరుచులలో మార్పులు సంభవించడం, తగు ఆదరణ లేక పోవడం ప్రబల కారణములనవచ్చును. తత్ఫలితంగా ప్రస్తుతం చాలా కొద్ది మగ్గములు మాత్రమే పనిచేస్తున్నవి. వాణిజ్య పరిశ్రమలశాఖ ఈ పరిశ్రమకు తగు సహాయం చేస్తున్నది. ప్రభుత్వ కుటీర పరిశ్రమల విక్రయశాల స్థానిక కార్ఖానాలలో ఉత్పత్తి చేయబడే హిమ్రూ వస్త్రములనుకొని, వాటిని భారత దేశంలోనేగాక విదేశాలలోకూడా విక్రయించే ఏర్పాట్లు చేస్తున్నది. వాణిజ్య పరిశ్రమలశాఖచే ఇవ్వబడుతున్న సాంకేతిక సహాయంతో హిమ్రూవస్త్రముల డిజైన్లు అభివృద్ధి పరచబడుతున్నవి. దీని నూలుకు ఉపయోగించబడు రంగులు చాలా చిక్కగావుంటాయి. ఈ నేతపనివారలకు చిక్కని రంగులుగల నూలు మాత్రమే ఈ శాఖ లభింపజేస్తున్నది. వివిధ హిమ్రూ డిజైన్లు, వస్త్రముల నమూనాలు గల ఒక అల్బమ్ (పుస్తకం) తయారు చేయబడుతున్నది. హైద్రాబాదు నగరంలో ఒక సహకార సంఘం పని చేస్తున్నది.

## క్రోచెట్ లేసు పరిశ్రమ

లేసు పరిశ్రమ నర్సాపురం, పాలకొల్లులోను, నర్సాపూరు తాలూకాలోని సుమారు 60 గ్రామాల్లోను విశేషముగా కొనసాగించ బడుతున్నది. కొక్కెము, నూలు దారము మాత్రమే దీనికి కావలసిన ముడివస్తువులు. మేలు రకము లేసు తయారీకి డైమండుదారం ఉపయోగించ

# వార్తా చిత్రాలు



28–1–1957 తేదీన ఆంధ్రప్రదేశ్ గవర్నరు హైద్రాబాదులో భారత - అమెరికా దేశాలమైత్రీ సంఘానికి ప్రారంభోత్సవంచేస్తూ ప్రసంగిస్తున్న దృశ్యం



రిపబ్లిక్ దినోత్సవంనాడు ఫతేమైదాన్‌లో శాలల విన్యాసప్రదర్శనం జరిగిన సందర్భంలో విచ్చేసిన ప్రేక్షకులు

ఆంధ్రప్రదేశ్ హోం మంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి 28–1–1957 తేదీన చంచలగూడా సెంట్రల్ జైలులో ఖైదీలకు బహుమతి ప్రదానంచేస్తున్న దృశ్యం

(దిగువ) రిపబ్లిక్ దినోత్సవంనాడు హైదరాబాదులోని ఆంధ్ర యువతీమండలి హాలులో ప్రభుత్వ సమాచారశాఖ వైజ్ఞానిక ప్రదర్శనాన్ని ఏర్పాటుచేసింది. ఆ ప్రదర్శనానికి విచ్చేసిన ప్రేక్షకులు



# ఖమ్మం - భూసంస్కరణలు

ఖమ్మం కొద్ది సంవత్సరాల క్రితం వరకు వరంగల్లు జిల్లాలో ఒక భాగంగా వుండేది. 1950 అక్టోబరు 1 వ తేదీన వరంగలు కలెక్టరు సర్వాధిపత్యంక్రింద ఖమ్మం, మధిర, ఇల్లెందు, పాల్వంచ, బూర్గంపాడు అనే ఐదు తాలూకాలతో, ఖమ్మం, కొత్తగూడెం అనే రెండు డివిజను లతో ప్రత్యేకంగా ఖమ్మంలో అడిషనల్ కలెక్టోరేటు ఏర్పాటు చేయబడింది. జిల్లాల పునర్నిర్మాణం ఫలితంగా 1953 అక్టోబరునెలలో ఖమ్మం ప్రత్యేకజిల్లా చేయబడింది. వరంగలుజిల్లానుంచి విభజించిన తరువాత ఇందులో అవే తాలూకాలు, అవే డివిజనులు వుంచబడినవి.

ఖమ్మంజిల్లా విస్తీర్ణం 4232.1 చదరపుమైళ్ళు. జనాభా 7,00,006. ఇందులో 3,59,089 మంది పురుషులు, 3,40,917 మంది స్త్రీలు వున్నారు. ఖమ్మంజిల్లా భౌగోళిక సరిహద్దులు ఇవి: ఉత్తరం - వరంగలుజిల్లా; దక్షిణం - కృష్ణాజిల్లా; తూర్పు - భద్రాచలం, తూర్పు గోదావరిజిల్లా; పడమట - నల్లగొండజిల్లా.

జిల్లాలో 674 గ్రామాలువున్నవి. ఖమ్మంమెట్టు, కొత్తగూడెం, ఇల్లెందు, మధిర, గార్ల ముఖ్యమైన పట్టణాలు. మొదటి మూడు పట్టణాలలో విద్యుద్దీపాలున్నవి.

రాష్ట్రంలోని అతివేడి ప్రదేశాలలో ఈజిల్లాకూడా ఒకటి. కొన్ని సందర్భాలలో ఉష్ణోగ్రత 120 డిగ్రీలవరకు హెచ్చుతుంది. కనిష్ఠ ఉష్ణోగ్రత 78 డిగ్రీలు. జిల్లాఅంతటా వేసవిలో ఎండలు తీవ్రంగాఉంటాయి. సగటు వర్షపాతం 39 అంగుళాలు.

ఈ జిల్లాగుండా గోదావరివంటి పెద్దనదేకాక, మునేరు, కట్టలేరు, కిన్నెరసాని వంటి చిన్ననదులుకూడా ప్రవహిస్తున్నవి. జిల్లాలో దట్టమైన అడవులున్నవి. ఆ అడవులలో పెద్దపులులు, చిరుతపులులు కన్పిస్తాయి.

వరి, పచ్చజొన్న, పచ్చపెసలు, పొగాకు ఈ జిల్లాలో ముఖ్యమైన పంటలు. ఆహార ధాన్యాల విషయంలో జిల్లా స్వయంసమృద్ధమైనది. ఇక్కడినుంచి జొన్నలు, ఇతరఅల్ప ధాన్యాలు పరిసరజిల్లాలకు ఎగుమతి చేయబడుతున్నవి.



జిల్లాలోగల 27,15,796 ఎకరాల భూమిలో 10,17,311 ఎకరాలు అడవులక్రిందవున్నది. 2,26,262 ఎకరాలు బంజరు భూమి. 2,23,974 ఎకరాలు పడావాభూమి. పైరులు నికరంగా 7,93,215 ఎకరాలలో వేయబడుతవి.

ఈజిల్లాలో ఒక కళాశాల, చాలా హైస్కూళ్ళు వున్నవి. ప్రజలలో అక్షరాస్యుల సంఖ్య క్రమంగా పెరుగుచున్నది.

## నీటివనరు ప్రాజెక్టులు

ఖమ్మం జిల్లాలో పాలేరు, వైరా, బేతుపల్లి, సింగభూపాలం ప్రాజెక్టులు పెద్ద నీటి వనరు ప్రాజెక్టులు.

పాలేరు ప్రాజెక్టు ఖమ్మం తాలూకాలోని పాలేరువద్ద వున్నది. ఈ ప్రాజెక్టు ఆరగాణి 651 చదరపు మైళ్ళు.

ఈ ప్రాజెక్టు క్రింద భూములకు సాగు నీరు లభింపజేయడం 1337 ఫసలీలో ఆరంభమైంది. సెటిల్మెంట్ శాఖవారు దీని క్రిందగల మాగాణి భూములకు రూ. 9-12-0 లు మొదలు రూ. 16-14-0 లు వరకు మెట్టభూములకు రూ. 0-8-6 లు మొదలురూ. 1-10-0 ల వరకుశిస్తు నిర్ణయించారు. ఈప్రాజెక్టు క్రింద వ్యవసాయం బాగా జరుగుచున్నది. వ్యవసాయ శిక్షణ తరగతులద్వారా రైతులకు తగు ప్రోత్సాహమివ్వబడుతున్నది. 1350 ఫసలీలో సర్వే సెటిల్మెంట్ శాఖవారు ఈ ప్రాజెక్టుక్రింద 16,084 ఎకరాల 33 గుంటల ఆయకట్టు నిర్ణయించారు. ఆ భూమి మొత్తం శిస్తు రూ. 2,07,472 లు.

ఖమ్మం పట్టణానికి 16 మైళ్ళ దూరంలో వైరా ప్రాజెక్టు వున్నది. ఇది వైరా నదిపై నిర్మింపబడింది. వైరా నది షజాత్ నగరం కొండలలో పుట్టింది. ఈ ప్రాజెక్టు ఆయకట్టులో ఒకేపంట (అబీ) వేయబడుతుంది.

బేతుపల్లి ప్రాజెక్టు మధిరతాలూకాలోవున్నది. ఇది మధిర నుంచి 70 మైళ్ళ దూరాన, ఖమ్మం నుంచి 60 మైళ్ళ దూరాన వున్నది. ఇది బేతుపల్లి గ్రామపు శివారు అగు, గంగారం గ్రామానికి ఒక మైలు దూరంలో వున్నది. బేతుపల్లిగ్రామం మధిరతాలూకా తూర్పుసరిహద్దున వున్నది బేతుపల్లి ప్రాజెక్టు తమ్మిలేరుపై కట్టబడింది. తమ్మిలేరు ఆరగాణి 102 చదరపుమైళ్ళు. ప్రాజెక్టు నిర్మాణానికి రూ. 2,27,300 లు అయింది. దీనిక్రింద 4,800 ఎకరాలు సాగు కావలెనవి పబ్లిక్ వర్క్సు శాఖవారు నిర్ణయించారు.

ఇల్లెందు తాలూకా సింగభూపాలం గ్రామంవద్ద సింగభూపాలం ప్రాజెక్టు వున్నది. దీనిక్రింద భూములకు సాగు నీరు లభింపజేయడం 1349 ఫసలీలో ఆరంభమైంది. 1955-56 సంవత్సరంలో 1707 ఎకరాల 10 గుంటల భూమి సాగుకు తేబడింది. అందువల్ల రూ 14,513 ల భూమి శిస్తు వచ్చింది.

## గనులు

ఈ జిల్లాలో బొగ్గుగనులనుంచి బొగ్గు త్రవ్వి తీయడం ప్రధానమైన పరిశ్రమ. ఈ జిల్లాలోనే సింగరేణి బొగ్గుగనులున్నవి. ఈ గనులనుంచి తీయబడు బొగ్గును భారతదేశంలోని పెద్ద రైల్వేలన్నీ ఉపయోగిస్తున్నవి. కొత్తగా కొత్తగూడెంవద్ద గనులు త్రవ్వబడినవి. ఆ గనులలో 100 మొదలు 1000 అడుగుల లోతువరకు బొగ్గు త్రవ్వి తీయబడుచున్నది. డబుల్ ఇన్‌లెట్ పంకాలద్వారా గనుల లోనికి గాలి వసతి ఏర్పాటు చేయబడింది.

బొగ్గు గనుల కార్మికులకు చక్కని వైద్య సౌకర్యాలున్నవి. ప్రవీణులైన వైద్యులు రోగులకు చికిత్సచేస్తారు. కాలరీల యజమానులు, కేంద్ర కార్మిక సంక్షేమశాఖవారు కలసి కార్మికులకు వినోద సౌకర్యాలు, వారి పిల్లల చదువుకు పాఠశాలలు ఏర్పాటు చేసినారు.

ఈజిల్లాలోని అప్పల నరసింహాపురం, పల్లభి, కొంగర, బుద్ధారం, వెలుగుమట్ల, వెంకటాయపాలెం, కల్లూరు, బయ్యారం గ్రామాలలో ముడి ఇనుము, అభ్రకం, బార్రైట్ మొదలగు ఖనిజములు లభించడంచేత దీనికి క్రమంగా జాతీయ ప్రాముఖ్యం వస్తున్నది. ముడి ఇనుము జపాను, జెకొస్లోవేకియా దేశాలకు ఎగుమతి చేయబడుచున్నది.

## సామాజికాభివృద్ధి

జిల్లాలో స్థానికఅభివృద్ధిపనుల పథకంవల్ల సామాజికాభివృద్ధి బ్లాకు, జాతీయవికాస కేంద్రాలవల్ల అభివృద్ధిపనులు చురుకుగా జరుగుతున్నవి.

వైరా సామాజికాభివృద్ధిబ్లాకు మొదట 1954 లో జాతీయ వికాసకేంద్రంగా పనిని ఆరంభించింది. అప్పుడు అందులో మధిర తాలూకాలోని 129 గ్రామాలు వుండేవి. ఆ తరువాత దానిని 1955 లో సామాజికాభివృద్ధిబ్లాకుగా మార్చడం జరిగింది. అలా దానిని అభివృద్ధి పరచడానికి ఆ కేంద్రం సాధించిన సత్ఫలితాలు. ఇక్కడి ప్రజలు అభివృద్ధిపనుల పట్ల చూపిన శ్రద్ధాసక్తులే కారణం. ఇక్కడ ఒక గ్రామీణ చేతిపరిశ్రమల కేంద్రం సంతృప్తికరంగా పనిచేస్తున్నది. ఆ కేంద్రంలో తయారైన వస్తువులకు మార్కెట్లో మంచి గిరాకీవున్నది. బ్లాకుక్రిందవున్న గ్రామాలన్నిటికీ వైద్య

సహాయం కల్పించబడుతున్నది. అభివృద్ధి కార్యక్రమం క్రింద ఇంతవరకు ఈ ప్రాంతంలో పాఠశాల భవనములు ఆరు, గ్రామ మందిరాలు మూడు నిర్మింపబడినవి.

1954 లో పాలేరుకు ఒక జాతీయవికాస కేంద్రం మంజూరు చేయబడింది. వైరా బ్లాకులోవలెనే ఈ కేంద్రంలోకూడా చక్కనికృషి జరుగుతున్నది. ప్రజలు కూడా చాలా ఉత్సాహంతో ముందుకువచ్చి సహకరిస్తున్నారు. ఈ కేంద్రంలో పాఠశాల భవనాలు నాలుగు, గ్రామ మందిరాలు మూడు నిర్మింపబడ్డవి.

ఈ జిల్లాలోని మూడవ జాతీయవికాస కేంద్రం బూర్గంపాడులోవున్నది. ఇది 1956 మే నెలలో ప్రారంభింపబడింది. పనులు చురుకుగా జరుగుతున్నవి.

## భూసంస్కరణలు

హైద్రాబాదులో మొట్టమొదటిసారిగా ఏర్పడిన ప్రజాస్వామిక ప్రభుత్వం భూసంస్కరణల సమస్యను పరిష్కరించడానికి పూనుకుంది. దున్నేవారే భూమికి యజమానులు కావాలనే లక్ష్యంతో శాసనం అమలులోకి తేబడింది. ఇది చాలా అభ్యుదయ దృక్పథంతో చేయబడిన శాసనం. దీనిని అమలు జరుపడంవల్ల తెలంగాణాలోని వేలాది రైతులకు కొత్త ఆశలు చిగిరిస్తున్నవి.

తీవ్రమైన ఈ భూసంస్కరణలు దేశమంతటా అమలులోకి వచ్చినవంటే భూమి అమరిక విధానంలో ఎంతో మార్పువచ్చి, దున్నేవారే భూమికి యాజమాన్యం వహించగలరు.

ఖమ్మంజిల్లాలో 1955 నవంబరు 1 వ తేదీనుంచి ఇట్టి భూసంస్కరణలు అమలులోకి రావడంతో భారతదేశ భూసంస్కరణల చరిత్రలో ఒక కొత్తఅధ్యాయం ఆరంభమైంది. ఆరోజున ఖమ్మంజిల్లాలోని అనేకమంది రక్షిత కౌల్దార్లు తాము ఎంతోకాలంనుంచి సేద్యంచేస్తున్న భూమికి యజమానులయ్యారు. సాధారణ కౌల్దార్లు మరికొన్ని హక్కులుపొంది రక్షణకౌల్దారులై కౌలు గ్యారంటీ పొందారు. మిగులు భూములుగల భూకామందులనుంచి భూములను స్వాధీనపరచుకొని భూములులేని రైతులకు పంచడమైనది.

ప్రస్తుతం వున్నట్టి భూ యాజమాన్య పద్ధతిలో అసమానత్వాలను తొలగించి, భూమి ఉపయోగవిధానంలో మార్పులు తెచ్చి మూడు కుటుంబకమతాల ప్రమాణానికి సమానమైన లేక దానికంటె మించివున్న భూములుగల భూకామందుల యొక్క కౌల్దార్ల ప్రతిపత్తినిపెంచే లక్ష్యంతో హైద్రాబాదు ప్రభుత్వం చట్టంలోని చాలా ముఖ్యమైన సెక్షనులు 38-ఇ, 37-ఏ, 53-సి, 53-జి లను అమలుపరిచే పథకాలకు మంజూరీ ఇచ్చింది. ఈ సెక్షనులు 1950 సంవత్సరపు హైద్రాబాదు కౌల్దారీ వ్యవసాయకభూముల చట్టానికి ప్రాణం వంటివి. ఈచట్టం 1956 లో తగువిధంగా సవరించబడింది కూడా. పైసెక్షనులు ప్రయోగాత్మకంగా 1955 సెప్టెంబరు నుంచి ఖమ్మంజిల్లాలో అమలు జరుపబడినవి.

సుదీర్ఘ ఫలితాల నిచ్చే ఇట్టి భూసంస్కరణలను అమలు జరుపడానికి ఖమ్మం జిల్లా చాలా అనువుగావున్నది. కారణమేమంటే ఈ జిల్లాలో గ్రామ రికార్డులు సరిగాలేవు. కౌలు విధానం సుస్థిరంగాలేదు. పరోక్ష భూస్వామ్య విధానంకూడా బాగా అమలులోవుంది. 38-ఇసెక్షను ననుసరించి భూమి యాజమాన్యం మార్పిడి రక్షిత కౌల్దార్లకే చెందునట్లుగా ప్రభుత్వం ప్రకటించవచ్చును. కౌల్దారీ చట్టం మొత్తంలో ఈ సెక్షన్ చాలా విప్లవాత్మకమైనది. ఇది ఖమ్మం జిల్లాలో అమలులోకి తేబడింది.

రక్షిత కౌల్దార్లు సేద్యం చేస్తున్న భూములపై యాజమాన్య హక్కులు 1955 నవంబరు 1 వ తేదీనుంచి వారికి కలుగజేయబడినవి. ఆ భూముల యజమానులకు 90 రోజుల గడువు ఇచ్చి ఆ గడువు లోపుగా వారు డిప్యూటీ కలెక్టర్ల వద్దకు వెళ్ళి రక్షిత కౌల్దార్లకు మార్పు చేయబడుతున్నట్టి భూములయొక్క సమంజసమైన ధరను నిర్ణయం చేయించుకొనవలసిందిగా తెలియజేయడమైనది. సౌకర్యం నిమిత్తమై డిప్యూటీ కలెక్టర్ల అధికారాలు స్పెషల్ తహశీల్దార్లకు ఇవ్వబడినవి. వారు వ్యవసాయభూముల న్యాయస్థానాలుగా వ్యవహరిస్తారు

భూమిపై యాజమాన్యం మార్పిడి ఒక కుటుంబకమతం ప్రమాణం వరకు మాత్రమే పరిమితం చేయబడింది. అంతేగాక ఆ మార్పిడివల్ల భూకామందుకు రెండు కుటుంబ కమతాల ప్రమాణం భూమి మిగులవలెననికూడా ఒక షరతు విధింపబడింది.

1950-51 సంవత్సరంలో 274017 ఎకరాల మెట్ట భూమికి 24429 మంది రక్షిత కౌల్దార్లుగా ప్రకటింపబడగా 38-ఇసెక్షనుక్రింద 11426 మంది రక్షిత కౌల్దార్లు 87268 ఎకరాల మెట్టభూమికి యజమానులయ్యారు. మిగిలినవారు రక్షితకౌల్దార్లుగా ప్రకటింపబడక పోవడానికి కారణం వారు, వారి భూకామందులు యాజమాన్య మార్పిడికి అవసరమైన షరతులను పూర్తి చేయజాలకపోవడమే. ఆ

కౌల్దార్లలో చాలామంది స్వచ్ఛందంగా భూములను కొనుక్కోవడానికి నిరాకరించారని గ్రామాలలో విచారణద్వారా తెలియవచ్చింది.

ఈ సెక్షన్ వర్తింపుజరిగిన భూకామందుల సంఖ్య 750. వీరిలో 525 మంది మిగులు భూములుగలవారు. మిగిలినవారికి రెండు కుటుంబకమతాల ప్రమాణంకంటె ఎక్కువ, గరిష్ఠ పరిమితి అంటే నాలుగున్నర కుటుంబకమతాల ప్రమాణంకంటె తక్కువ భూములున్నవి.

ఒక్కొక్క కౌలుదారుకు సగటున 7.6 ఎకరాల మెట్ట భూమి లభించింది. మొత్తం రక్షిత కౌల్దార్లలో నూటికి 46 వంతులమంది కౌల్దార్లక్రిందవున్న మొత్తంభూమిలో 50.4 శాతంభూమికి యజమానులయ్యారు. ఈ పైదానిలో 8802 ఎకరాల మెట్టభూమినుంచి బేదఖలు చేయబడ్డ 946 మంది రక్షిత కౌల్దార్లుకూడా వున్నారు.

సమంజసమైన ధరల నిర్ణయానికి సంబంధించినపని జిల్లా అంతటా పూర్తి చేయబడింది.

ఖమ్మం జిల్లాలో 38-ఇసెక్షన్ క్రింద కొత్తగా భూమికి యజమానులుగా ప్రకటింపబడినవారికి సహాయపడే నిమిత్తమై ప్రభుత్వం రూ. 5,000 ల తక్కావీ మంజూరు చేసింది.

వ్యవసాయభూముల న్యాయస్థానాలు చెప్పిన తీర్పులవల్ల ఇబ్బందికి లోనైనవారు ఆ ఉత్తర్వులను రద్దు చేయవలసిందిగా కోరుతూ 879 దరఖాస్తులు దాఖలుచేశారు. వీటిలో 5112 కేసులు ఇంతవరకు పరిష్కరింపబడ్డవి. అపీలు దరఖాస్తులలో చాలా వరకు భాగాల పంపిణీలు, భూకామందుల ఆక్రమణలు, లేదా రక్షిత కౌలుదార్లు భూములు వదులుకోవడం మొదలగు కారణాలు చూపబడినవి. ఈ అపీళ్ళన్నీ కౌల్దారీ శాసనపు నిబంధనల ననుసరించి పరిష్కారం చేయబడుతున్నవి.

చట్టం యొక్క 37 ఏ సెక్షనుక్రింద మరొక పథకం అమలు జరుపబడుతున్నది. ఈ సెక్షను 1955 మార్చి 12 వ తేదీనుంచి మూడు కుటుంబ కమతాల ప్రమాణం లేక అంతకంటె ఎక్కువ భూమిగల భూకామందుల యొక్క సాధారణ కౌలుదార్ల ప్రతిపత్తిని రక్షిత కౌలుదార్ల ప్రతిపత్తికి తేవడానికి సంబంధించినది.

ఈ రక్షిత కౌల్దార్లుకూడా భూకామందుల నుంచి భూములను కొనవచ్చును. అంతేగాక ప్రభుత్వంతలపెట్టిన నిర్బంధ యాజమాన్య మార్పిడి పథకంక్రింద భూమిపై యాజమాన్యం మార్పిడికి వీరు అర్హులై వున్నారు. 37 ఏ సెక్షన్‌క్రింద 6785 మంది సాధారణ కౌల్దార్లు రక్షిత కౌల్దార్లుగా ప్రకటింపబడినారు. వారు 39,136 ఎకరాల మెట్టభూమిపై సేద్యం చేస్తున్నారు.

53-సి, 53-జి. సెక్షనుక్రింద 4½ కుటుంబ కమతాల ప్రమాణానికిమించి భూమిగల భూకామందులనుంచి మిగులు భూములను ప్రభుత్వమే స్వాధీనపరచుకొని నిర్వహణను చక్కబరుస్తుంది. 75,221 ఎకరాల మెట్టభూమి మిగులుగా వున్నదని ప్రాథమిక అంచెనాలవల్ల తేలింది. ఈ భూమి 525 మంది భూకామందుల అధీనంలోవున్నది. 1955 సంవత్సరపు యాజమాన్య స్వీకార, మిగులు భూముల సేకరణ నియమావళి క్రింద వారికి నోటీసులు ఇవ్వబడినవి. సక్రమమైన విచారణలుకూడా జరుగుతున్నవి. కౌల్దారీ శాసనం క్రింద భూముల యాజమాన్య స్వీకారం, మిగులు భూముల స్వాధీనమునకు సంబంధించిన పనులను డిప్యూటీ కలెక్టర్లు ప్రారంభించారు.

ఇటువంటి తీవ్ర ఫలితాలనిచ్చే కౌల్దారీచట్టం త్వరపడి అమలు జరపడానికి వీలులేదు. కనుక నెమ్మదిగా మంచి చెడ్డలు ఆలోచించి అమలు జరుపబడుతున్నది. కౌల్దారీ చట్టంయొక్క 53-ఇ సెక్షనుక్రిందమిగులు భూములను సహకార వ్యవసాయ సంఘాలకు, చిన్నరైతులకు, భూములులేని వ్యవసాయ కూలీలకు ఇవ్వడమవుతుంది.

ప్లానింగ్ కమీషన్‌వారు చెప్పినట్లుగా భూమిపై యాజమాన్యంసమస్య దేశాభివృద్ధిలో ఒక అంతర్భాగం. ఖమ్మం జిల్లాలో ప్రారంభింపబడిన ఈకృషి భూముల సమాన పంపిణీ కార్యక్రమంలో తొలిచర్య. దీనివల్ల సేద్యదారులకు భూములులేని కొరతతీరి ఆహారధాన్యాల ఉత్పత్తి అధికం కాగలదు.



# నెల్లూరు జిల్లాలో సాగునీటి వనరులు



నెల్లూరు జిల్లాలో కరువు ప్రాంతాలకు సహాయ పడే ఉద్దేశతో తలపెట్టబడిన ప్లానింగు అభివృద్ధి కార్యక్రమం క్రింద మూడు మధ్యరకం ప్రాజెక్టుల నిర్మాణం ఇటీవలనే పూర్తిచేయ బడింది.

## నక్కలగండి రిజర్వాయరు పథకం

నెల్లూరుజిల్లాలోని ఉదయగిరి తాలూకాలో నక్కలగండవద్ద ఉప్పువాగుకు ఒక రిజర్వాయరు నిర్మించడానికి రూ. 11.9 లక్షల వ్యయం అంచనా వేయబడింది. ఉప్పువాగు పిళ్ళపేరుకు ఉపనది. ఇది ఉదయగిరి తాలూకాలోని మన్నేరులో కలుస్తుంది.

ఆనకట్ట స్థలంవద్ద ఉప్పువాగు ఆరగాణి 53 చదరపు మైళ్ళు. ఇక్కడ సగటు వర్షపాతం 25 అంగుళాలు. తరచుగా ఈప్రాంతంలో వర్షాలుండవు. పైగులు వేసేకాలంలో హెచ్చు తగ్గులుగా వానలు కురుస్తాయి. ఈ కారణాలచేత పంటలు నష్టపడుతూ వుంటాయి. కనుక ఉప్పువాగుకు ఒక మట్టికట్ట నిర్మించి, కుడివైపున మిగులుకట్ట వేసి రిజర్వాయరు నిర్మాణానికి ఒక పథకం తలపెట్టబడింది. నక్కలగండి వద్ద ఆనకట్టస్థలం నిర్ణయింప బడింది. అది ఆనకట్టకు మిక్కిలి అనువైన ప్రదేశం. కట్టపొడవు 800 అడుగులు. కుడివైపు మిగులుకట్ట ముందుభాగానికి మెట్లు పర్చరచి రాతిపని చేయడమైనది. ఈ మిగులు కట్ట పొడవు 360 అడుగులు. హెడ్‌స్లూయిస్ (పెద్దతూము) వద్ద కుడివైపునుండి 5 మైళ్ళ 3 ఫర్లాంగుల నిడివి కాలువ త్రవ్వి ఈ రిజర్వాయరునుంచి 1000 ఎకరాలకు నీరు సరఫరా చేయబడుతుంది. ఎడమవైపుకూడా ఒకతూము నిర్మింప బడుతుంది. అయితే రిజర్వాయరు నీటి సరఫరా ప్రమాణాన్ని గమనించిన తరువాతనే సాగుకు ఈతూముగుండా నీరు వదలబడుతుంది. ఈపథకం పనిఅంతా మొదటి అంచనాకంటె చాలా తక్కువగానే అంటే రూ. 7.5 లక్షలతోనే పూర్తిచేయబడింది.

## పాలేరు రిజర్వాయరు పథకం

ఈ రిజర్వాయరు కనిగిరి తాలూకాలో వున్నది, కనిగిరి తాలూకాలో పాండవ నాగులవరం గ్రామానికి సమీపాన పాలేరునదిపై ఇది నిర్మింపబడింది. పాండవ నాగులవరం గ్రామానికి తూర్పున దాదాపు ఒక మైలుదూరంలో రిజర్వాయరు కలదు. కనిగిరిలో సగటు వర్షపాతం 22-42 అంగుళాలు. పాలేరు నది ఒకటి మాత్రమే ఈ చెరువు ప్రదేశంగుండా ప్రవహిస్తుంది. అయితే ఈ నది ఇంతవరకు సరిగా వినియోగింపబడలేదు. దీనిపై రిజర్వాయర్ నిర్మాణానికి అనేక స్థలాలు ఎన్నిక చేయబడినవి. వీటిలో అన్నిటికంటె మొదటిది, పైదీ పాండవగండి రిజర్వాయరు.

1080 అడుగుల పొడవున మట్టికట్ట, 870 అడుగుల పొడవున రాళ్ళతో మిగులుకట్ట వేసి రిజర్వాయరు నిర్మాణం చేయబడింది. రిజర్వాయరుకు ఎడమవైపున ఒక కాలువ త్రవ్వి దానిద్వారా 1128 ఎకరాల మెట్టభూములకు, కంకానంపాడు చెరువుక్రింద గల 300 ఎకరాల మాగాణికి సాగునీరు సరఫరా చేయడానికి ఈ రిజర్వాయరు తలపెట్ట బడింది. కంకానంపాడు చెరువు చాలా పెద్దది. ఇది పూర్వం జమీన్ చెరువు జమీలన్నీ ప్రభుత్వపరం కావడంతో ఆహారోత్పత్తి శాఖవారు ఈ చెరువును పునరుద్ధరించారు. హెడ్‌స్లూయిస్‌వద్దనుంచి 4 మైళ్ల పొడవున కాలువత్రవ్వి సాగునీటిని సరఫరాచేయవలెనని ఈ పథకంకింద తలపెట్ట బడింది. ఈపథకం పని అంతా రూ. 7 లక్షల వ్యయంతో పూర్తిచేయ బడింది.

## ఉప్పుటేరు దిగువఆనకట్ట పథకం

ఈ ఆనకట్ట కందుకూరు తాలూకాలో నున్నది. మన్నేరుకు ఉపనది ఉప్పుటేరు. కందుకూరు తాలూకాలో పెదపావని గ్రామంవద్ద కొమ్మివాగుపాయ

సంగమ స్థలంవద్ద మొదట ఉప్పుటేరుకు ఒక ఆనకట్ట నిర్మింపబడింది. దానినుంచి ఒక కాలువ త్రవ్వి కొత్త పేట చెరువు, బద్దేపూడి చెరువు, భీమవరం చెరువు, లచ్చిరాజుపాలెం చెరువు, రాజుపాలెం పెద్ద చిన్న చెరువులకు నీరు వదలడానికి ఏర్పాట్లు చేయబడినవి.

ఉప్పుటేరుపై ఆనకట్ట నిర్మించడానికి తలపెట్ట బడిన స్థలంవద్ద దాని ఆరగాణి 170 చ. మైళ్ళు. ఇందులో 63 చదరపుమైళ్ళ ప్రాంతానికి కొండా పురంవద్ద ఆనకట్టవల్ల ఆటంకం కలుగుతున్నది. ఈ ఈ ఆరగాణిప్రాంతంలో సగటువర్షపాతం 30 అంగుళాలు. ఈ ఆరగాణి నీటివల్ల ప్రస్తుత ఆయకట్టు 1142 ఎకరాలకూ, క్రొత్త ఆయకట్టు 750 ఎకరాలకూ సాగునీరు లభ్యం కాగలదు. ఈ పథకం క్రింద అదనంగా 875 టన్నుల ఆహారధాన్యాలు పండగలవు.

270 అడుగుల పొడవున ఒక ఆనకట్ట, దానికి కుడివైపున ఒక్కొక్కటి 6'-0×6'-6 అడుగులవి మూడుతూములు నిర్మింపవలెనని ఈ పథకంలో తల పెట్టబడింది. పైన పేర్కొనబడిన చెరువులన్నీ ఉప్పు టేరుకు కుడివైపున వున్నవి. ఆనకట్టకు కొంచెం ఎగువున కుడివైపున 14 మైళ్ళ 4 ఫర్లాంగుల నిడివి కాలువ, ఆ కాలువకు ఒక్కొక్కటి 6'×4' అడుగులవి 2 తూములతో ఒక హెడ్ స్లూయిస్ నిర్మింపబడినవి. ఆనకట్ట పునాది సిమెంటు కాంక్రీటుతో వేయబడింది. ఈ పని అంతా రూ. 11.5 లక్షల వ్యయంతో పూర్తిచేయబడింది.



## ఆంధ్ర ప్రదేశ్ చేతి పరిశ్రమలు [15వ పేజీ తరువాయి]

బడుతుంది. లేసు పరిశ్రమలో ఇప్పుడు సుమారు 5000 మంది పనిచేస్తున్నారు. దోమెల్సు, టీబల్లబొర్డర్లు, ఓవల్ సెంటర్లు, లేసు అంచులు మున్నగు లేసులు తయారుచేయ బడుతాయి. రెండవ ప్రపంచయుద్ధానికి పూర్వం యీ పరిశ్రమలో అనేక వ్యాపారసంస్థలు, వ్యాపారస్థులు వ్యాపారంచేసే వారు. అప్పుడు యీ క్రోచెట్ పని క్రమబద్ధమైనపద్ధతిలో నడిచేది. గత 12 సంవత్సరాలనుంచీ ఎగుమతి మార్కెటులో ఇది తగ్గుముఖం పట్టింది.

ఇప్పటికీ సాలీనా రూ. 15 లక్షల విలువగల లేసు ఉత్పత్తి చేయబడుతున్నది. ఈ పరిశ్రమను సహకారపద్ధతి పైన నడిపించుటకు కృషి చేయబడుతున్నది. ఈ పరిశ్రమ వల్ల డాలర్లు సంపాదించవచ్చు. అందువల్ల దీనిని ప్రోత్సహించవలసి ఉన్నది. వ్యాపార ఒప్పందాలలో నర్సాపూరు లేసును, ఇతర దేశాలు కొను కుటీరపరిశ్రమల వస్తువులలో చేర్చినట్లయితే ఈ పరిశ్రమ బాగా పైకివస్తుంది. స్టాండర్డు డిజైనులు గల ఒక కేటలాగు తయారుచేయడం ఎంతో అవసరం.

### చేతిపరిశ్రమల వస్తువుల అమ్మకం

చేతివస్తువుల అమ్మకానికి ప్రభుత్వ కుటీర పరిశ్రమల విక్రయశాల ముఖ్య మార్కెటింగు సంస్థగా పనిచేస్తున్నది. ఇది 1930 సం. లో స్థాపించబడింది. ఈ విక్రయశాలను విస్తృతపరచుటకు వాణిజ్య పరిశ్రమల శాఖ భారత ప్రభుత్వానికి ఒక పథకాన్ని అందజేసింది. ఈ పథకాన్ని అమలు పరచుటకు రూ. 3.5 లక్షలు ఖర్చుఅవుతాయి. ఐతే భారత ప్రభుత్వం చెలామణి మూలధనం క్రింద రూ. 1 లక్ష, పథకంఅప్పత్తి ఖర్చుకు రూ. 15,400 లు మాత్రమే మంజూరుచేసింది.

### కేంద్రవిక్రయశాల, విజయవాడ

1955 సెప్టెంబరులో విజయవాడలో వాణిజ్య పరిశ్రమల శాఖ ఆధ్వర్యాన ఒక కేంద్ర విక్రయశాల తెరువ బడింది. ఈ విక్రయశాలకు అఖిలభారత చేతివస్తువుల సంఘం ఆర్థిక సహాయం క్రింద రూ. 2000 లు, అప్పు క్రింద రూ. 20,000 లు ఇచ్చింది. చేతివస్తువుల విక్రయ సమస్యలను పరిష్కరించడమే దీని ముఖ్యోద్దేశం.

### రెండవ ప్రణాళికలో చేతిపరిశ్రమలు

చేతి పరిశ్రమల అభివృద్ధికై రెండవ ప్రణాళికలో పాత పథకాలను కొనసాగించుటకు రూ. 1.32 లక్షలూ, క్రొత్త వాటిని అమలుపరచుటకు రూ. 20.43 లక్షలూ ప్రత్యేకించ బడినవి. 1957-58సంవత్సరానికి ప్రతిపాదించబడిన బడ్జెటు అంచనా వివరములు ఇవి :

| ఆదాయం | | మూలధనం | |
|---|---|---|---|
| అవృత్తఖర్చు | అనావృత్తఖర్చు | గ్రాంటు | అప్పు |
| రూ. | రూ. | రూ. | రూ. |
| 2,63,275 | 1,03,450 | 1,66,750 | 4,36,412 |

# ★ డైరీ ★

—-○—

## 1957 జనవరి

1. రాష్ట్ర గవర్నరు 17 వ అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనానికి ప్రారంభోత్సవంచేస్తూ ద్వితీయ పంచవర్ష ప్రణాళికను విజయవంతంగా అమలు పరచాలంటే రాష్ట్రప్రభుత్వ ఆదాయం పెంచాలని వక్కాణించారు.

యూనివర్శిటీలలో ప్రస్తుతం ఆంగ్లభాషయే బోధనా భాషగా కొనసాగాలని ఇటీవల నగరంలో జరిగిన విద్యార్థుల నేషనల్ యూనియన్ యొక్క ద్వితీయ అఖిలభారత మహాసభ అభిప్రాయ పడింది.

2. వాల్తేరు హైదరాబాదు నగరాల మధ్య శీఘ్ర ప్రయాణ సౌకర్యాలు కలగాలంటే ఈ రెండు పట్టణాలమధ్య 'ఫీడర్ ఎర్ సర్వీసు' వుండటం ఎంతైనా అవసరమని ముఖ్యమంత్రి సూచించారు.

3. భారత రిపబ్లిక్ అధ్యక్షులు మద్రాసు సాధారణ అమ్మకంపన్ను (ఆంధ్ర రెండవ సవరణ) చట్టానికి ఆమోదం తెలిపారని అసాధారణ గెజెటులో ప్రకటించబడింది. ఆంధ్రశాసనసభ గతఅక్టోబరునెలలో ఈచట్టాన్ని ఆమోదించింది. ఈ చట్టంప్రకారం కొన్ని అవసరమైన వస్తువులపై అంటే మధ్యరకం బట్టలు, ముతకబట్టలు, కిరసనాయిలు, బెల్లం, ఎరువులు, వేరుసెనగనూనె, ఇనుము క్రయ విక్రయాలపై సింగిల్ పాయింటుపన్ను విధించబడుతుంది.

4. రాష్ట్ర వ్యవసాయమంత్రి పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ ఉత్పత్తిదారుల సహకార సంఘాలద్వారా పొగాకు సరఫరా అయ్యేట్లయితే సోవియట్ రష్యా తక్కువ గ్రేడు పొగాకుతోబాటు అన్నిరకాల భారతీయ పొగాకును అంతర్జాతీయ మార్కెట్టు ధరల ప్రకారం కొనుటకు అంగీకరించినదని తెలిపారు.

ప్లానింగు కమీషను, కేంద్రరాష్ట్ర ప్రభుత్వాల అధికారులు చర్చలు జరిపినతరువాత ఆంధ్రప్రదేశ్ లో ద్వితీయ పంచవర్ష ప్రణాళికయొక్క రెండవ సంవత్సరంలో అంటే 1957-58 సం. లో అభివృద్ధి పథకముల కొరకు తాత్కాలిక ప్రణాళికలు నిర్ణయించారు.

5. పశ్చిమ గోదావరి, నెల్లూరు జిల్లాల్లో రూ. 15,78,700 ఖర్చుతో 16 పారిశ్రామిక సంస్థలకు, 503 వ్యవసాయ సంస్థలకు, 581 నివాస గృహములకు, 200 వీధి దీపాల సర్వీసులకు, 22 గ్రామాలలో 1 హెచ్. టి. ఇండస్ట్రియల్ సర్వీసుకు విద్యుచ్ఛక్తి సరఫరాను విస్తృత పరచుటకు ప్రభుత్వం మంజూరీ ఇచ్చింది.

6. భారత ప్రభుత్వ సామూహికాభివృద్ధి మంత్రిత్వశాఖ ఆంధ్రప్రదేశ్ కు 1957-58 సంవత్సరానికి 25 జాతీయ విస్తరణ సేవా కేంద్రాలను కేటాయించింది.

7. రాష్ట్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ కు రాష్ట్ర రవాణా సంఘాన్ని నియమించింది.

నెల్లూరుజిల్లాలో రూ. 2,83,500ఖర్చుతో ఆరు గ్రామాల్లో 3 పారిశ్రామిక సంస్థలు, 45 వ్యవసాయ సంస్థలు, 186 నివాసగృహములు, 26 వీధి దీపాల సర్వీసులకు విద్యుచ్ఛక్తి సరఫరాను విస్తృతపరచుటకు ప్రభుత్వం మరొక పథకానికి మంజూరీ ఇచ్చింది.

8. తుంగభద్ర ఆనకట్టవద్ద 9000 కిలోవాట్ల శక్తిగల ప్రథమ హైడల్-పవర్ జనరేటర్ పనిచేయనారంభించింది. ఇప్పుడు రాయలసీమ జిల్లాలకు ఇక్కడనుంచి విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడుతున్నది.

విస్తృత ఆంధ్రరాష్ట్ర పారిశ్రామికాభివృద్ధిపట్ల తగుశ్రద్ధ గైకొనబడుతుందనీ, భూములులేని కార్మిక ప్రజానీకం భయపడవలసిన అవసరం లేదనీ కేంద్ర ప్లానింగ్ కమీషన్ వారు హామీ ఇచ్చారు.

9 ఆంధ్రరాష్ట్ర చేనేత సహకారసంఘ ప్రతినిధివర్గం రాష్ట్ర సహకార మంత్రితో తమ ఇబ్బందులు

నివేదించుకొన్న మీదట, చేనేత పనివారల ఇబ్బందులను నివారించుటకై చేనేత వస్త్రాల నిలవలను కొనవలసిందిగా ప్రభుత్వం అఖిలభారత చేనేతబోర్డును అభ్యర్థించిందని మంత్రిగారు చెప్పారు.

10. హైదరాబాదు వ్యవసాయ సహకార సంస్థ రిజిస్ట్రేషనును వెంటనే రద్దుపరచుటకు రాష్ట్ర మంత్రి వర్గం నిర్ణయించింది.

11. హైదరాబాదు సిటీ మునిసిపల్ కార్పొరేషనుగనుక మురికిపేటల నిర్మూలన, మురికికాలవల అభివృద్ధి పథకానికిగాను రూ. 20 లక్షలు ఇచ్చేట్లయితే, కార్పొరేషనుకు గ్రాంటుక్రింద రూ. 20 లక్షలు, అప్పుక్రింద రూ. 40 లక్షలు ఇస్తామని భారత ప్రభుత్వం తెలిపింది.

12. రాష్ట్రంలో ప్రైమరీ టీచర్ల జీతాలు హెచ్చించబడే అవకాశాలున్నాయని రాష్ట్ర విద్యామంత్రి తమ ఆశాభావం వెల్లడించారు.

రాష్ట్ర ఆర్థికమంత్రి హైద్రాబాదు ఇన్సూరెన్సు ఇన్‌స్టిట్యూట్ ఏర్పాటుచేసిన ఉపన్యాస గోష్ఠులకు ప్రారంభోత్సవంచేస్తూ, దేశంలో ప్రవేశ్యాల్భ్యాన్ని అరికట్టాలంటే గ్రామీణ ప్రాంతాల ఆర్థికస్తోమతలను సంపూర్ణంగా ఉపయోగించాలనీ, ఇందుకు జీవిత భీమాఫండు ఆదర్శమైన సంస్థగా ఉపకరించగలదనీ అన్నారు.

13. హోంమంత్రి హైద్రాబాదులో రేడియో వారోత్సవాలకు ప్రారంభోత్సవం చేస్తూ వెయ్యిమంది జనాభాగల ప్రతి గ్రామానికి ఒక కమ్యూనిటీ రేడియోసెట్టును సరఫరా చేయుటకు తలపెట్టబడిందని అన్నారు.

14. రాష్ట్ర పబ్లిక్‌సర్వీసు కమీషన్, రాష్ట్ర సభార్డినేటు,మినిస్టీరియల్ సర్వీసులకొరకు ఈ సంవత్సరం అక్టోబరులో అభ్యర్థుల ప్రథమ రిక్రూట్మెంటు ఆరంభిస్తుందని కమిషన్ అధ్యక్షులు వెల్లడించారు.

15. రాష్ట్ర గవర్నరు నేషనల్ సేవింగ్సు పక్షోత్సవాల సందర్భంలో ఆలిండియారేడియో హైదరాబాదు నిలయంనుంచి ప్రసంగిస్తూ వివాహబహుమతులు, కట్నాలు సేవింగ్సు సర్టిఫికెట్ల రూపంలో ఇవ్వాలని సూచించినారు.

1957-58 సంవత్సరంలో తక్కావీ అప్పుల క్రింద వ్యవసాయదారులకు డబ్బు పంచిపెట్టుటకుగాను భారతప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వానికి ఇచ్చిన అప్పును కోటి రూ. ల నుండి రూ. 3 కోట్ల 10 లక్షలకు పెంచిందని రాష్ట్రవ్యవసాయమంత్రి తెలియజేశారు.

16. రాష్ట్ర సహకారశాఖామంత్రి 'సహకార దినోత్సవ' సందర్భంలో బద్రూకా కామర్సు కళాశాల విద్యార్థుల సభలో మాట్లాడుతూ ప్రభుత్వం రాష్ట్రంలోని వినిమయదారుల సహకారసంఘాల నన్నిటినీ త్వరలోనే కో-ఆపరేటివ్ మార్కెటింగు సొసైటీలుగా మార్చుటకు తలపెడుతున్నదని వెల్లడించారు.

17. రాష్ట్రముఖ్యమంత్రి సేవింగ్సుపక్షోత్సవాలకు అధ్యక్షతవహిస్తూ ప్రస్తుత ఆర్థికసంవత్సరానికి స్మాల్ సేవింగ్సుకొరకు రాష్ట్రానికి రూ. 3 కోట్ల లక్ష్యం నిర్ణయించబడిందనీ కనుక ఈ లక్ష్యసాధనకు ప్రజలు తోడ్పడాలనీ విజ్ఞప్తి చేశారు.

18. ఇక కొన్ని నెలల్లో హైద్రాబాదులోని రేడియో స్టేషనులో 10 కిలోవాట్ల షార్టువేవ్ ట్రాన్స్‌మీటర్ నెలకొల్పబడుతుందని ఆలిండియా రేడియో డిప్యూటీ డైరక్టరు జనరల్ తెలియజేశారు.

సికింద్రాబాదు మునిసిపల్ కార్పొరేషన్ త్వరలో మురికిపేటల నిర్మూలనపని ఆరంభిస్తుంది. ఈ పథకానికి రూ. 2 లక్షలు ఖర్చు అవుతుంది. ఇందుకై కార్పొరేషన్ సమావేశంలో ఒక తీర్మానం ఆమోదించబడింది.

19. రాష్ట్ర శాసనసభ సమావేశం మార్చి 20 వ తేదీనాడు జరుపుటకు రాష్ట్రప్రభుత్వం నిర్ణయించింది.

20. రాష్ట్ర ముఖ్యమంత్రి విజయవాడ రేడియో స్టేషనులో క్రొత్తగా నెలకొల్పబడిన 20 కిలోవాట్ల మీడియంవేవ్ ట్రాన్స్‌మీటర్‌కు ప్రారంభోత్సవం చేశారు.

21. 1920 సంవత్సరపు మద్రాసు ప్రాథమిక విద్యా చట్టాన్ని ప్రభుత్వం సవరణ చేసింది. ఈచట్టం రాష్ట్రంలోని ఆంధ్ర ప్రాంతానికి వర్తిస్తుంది. నిర్బంధ ప్రాథమిక విద్యావ్యాప్తి ఇందులో ముఖ్యాంశం. ఎలిమెంటరీ స్కూళ్ళలో 8వ తరగతివరకు, సెకండరీ స్కూళ్ళలో 3 వ ఫారంనకూ ఈ చట్టం వర్తిస్తుంది.

హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరాలలోని 25 ట్రేడు యూనియనులు ఆహారధాన్యాల

ధరల పెరుగుదలపట్ల కార్మికుల నిరసనను తెలుపుటకై ఫిబ్రవరి 8 వ తేదీన ఆహారధాన్యముల దినము ను జరుపుటకు నిర్ణయించినవి.

22. రాష్ట్ర పరిశ్రమల, కార్మిక శాఖల మంత్రి దుకాణములు, పారిశ్రామిక సంస్థల చట్టమును తగు విధంగా సవరణచేసి సక్రమంగా అమలుపరచే ఉద్దేశంతో యజమానులు, కార్మికుల అభిప్రాయాలు తెలుసుకొనుటకుగాను వారి ప్రతినిధులతో సంప్రదించారు.

23. కాశ్మీరు సమస్యపైన కరాచీలో జరిగిన అసభ్య ప్రదర్శనపట్ల నిరసనగా హైద్రాబాదు, సికిందరాబాదు జంటనగరాలలోని స్కూళ్ళు, కాలేజీల విద్యార్థులు సుమారు 15 వేలమంది తరగతులకు హాజరు కాలేదు.

24. అటవీ ప్రాంతంలో పశువులమేత రుసుమును తగ్గించే విషయాన్ని ప్రభుత్వం పరిశీలిస్తున్నదని రాష్ట్ర వ్యవసాయమంత్రి చెప్పారు.

25. వివిధ సర్వీసులకు గ్రెడేషన్ జాబితాలు తయారుచేయుటకూ, సర్వీసులను లీనీకరణం చేయుటకూ ప్రభుత్వం ప్రతిశాఖకు లేక సర్వీసుకు సలహా సంఘాలను ఏర్పాటుచేయుటకు నిర్ణయించింది.

26. సప్తమవార్షిక రిపబ్లికోత్సవం రాజధానినగరంలోనూ, రాష్ట్రమంతటా కడువేడుకతో జరుపబడింది. ఈ సందర్భంలో రాష్ట్రగవర్నరు ఒక సందేశమిస్తూ 'ముందుముందు ఎంతో చేయవలసి వుంది. ప్రగతి సాధనలో నైతిక, ఆధ్యాత్మిక విలువలప్రాముఖ్యాన్ని మనం మనస్సులో వుంచుకోవాలి' అని అన్నారు.

27 తుంగభద్ర హైలెవల్ కాలువ త్రవ్వటకు ప్రాథమిక పనికై తన వాటాక్రింద రాష్ట్రప్రభుత్వం రూ. 10 లక్షలు మంజూరు చేసింది.

28 రాష్ట్రహోంమంత్రి, జైళ్లు, బాలనేరస్థుల సంస్థల అధికారుల సమావేశానికి ప్రారంభోత్సవం చేస్తూ అధికారులు, ఖైదీలకు ఉపయోగకరమైన పనులు కల్పించే సమస్యల పట్లనేగాక ఖైదీలు జైలుశిక్ష అనుభవించుకాలంలో వారిపైన ఆధారపడువారి విషయమైకూడా శ్రద్ధవహించాలని అన్నారు.

29. మిల్లుబట్టల వ్యాపారస్తులు రూపాయలో అణా మూడుపైసలు చొప్పున అదనపు పన్నును రియాయతీపై చెల్లించుటకు ప్రభుత్వం వారికి ఇచ్చిన ఆఖరు గడువును, కొన్ని షరతులకు లోబడి 1957 మార్చివరకు పొడిగించింది

30. రాష్ట్ర పునర్విభజన చట్టం సక్రమమైనదని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు తీర్పు చెప్పింది.

31. ద్వితీయ పంచవర్షప్రణాళిక క్రింద గ్రామీణ పథకాలను అమలుపరచడంలో తెలంగాణా ప్రాంతానికి సహాయపడుటకై గ్రామీణ ప్లానింగు, డెవలప్మెంటు కమిటీలను ఏర్పాటుచేయుటకు ప్రభుత్వం నిర్ణయించింది. ఇట్టి కమిటీలు ఆంధ్రప్రాంతంలో ఇదివరకే వున్నాయి.

# వార్తలు - విశేషాలు



## పోలింగ్ వేళలు

ఆంధ్రప్రదేశ్ శాసనసభ నియోజకవర్గాలలో, పార్లమెంటరీ నియోజకవర్గాలలో అవసరమైనట్లయితే ఉదయం 8 గం. ల నుంచి మధ్యాహ్నం 12 గం. ల వరకు, తిరిగి మధ్యాహ్నం 1 గం. నుంచి సాయంత్రం. 5 గం. ల వరకు పోలింగు జరుగవలెనని ఎన్నికల కమీషన్ నిర్ణయించింది.

## రెండు ఆర్డినెన్సులు

1953 సంవత్సరపు ఆంధ్ర వేతనముల చెల్లింపు అనర్హతల తొలగింపు చట్టమును సవరించడానికై రాష్ట్ర గవర్నర్ ఒక ఆర్డినెన్సు జారీచేశారు. ఈ ఆర్డినెన్సు 1957 జనవరి 26 వ తేదీనాటి అసాధారణ గెజెటులో ప్రకటించబడింది.

1347 హిజ్రీ హైద్రాబాదు పారిశ్రామిక నిధినియమావళిని సవరించడానికై మరొక ఆర్డినెన్సు అమలులోకి తేబడింది. ఈ ఆర్డినెన్సు ననుసరించి పారిశ్రామికనిధిని రాష్ట్ర ప్రభుత్వమే పరిశ్రమల శాఖద్వారా కంట్రోలుచేసి యాజమాన్యం నిర్వహిస్తుంది. ఇది తక్షణమే అమలులోకి వస్తుంది. ఈ ఆర్డినెన్సు చేయకపూర్వం ఆ నిధిని కంట్రోలు చేస్తున్నట్టి బోర్డు రద్దు అయినట్లుగా భావింపవలెను.

## రెవిన్యూబోర్డుకు నూత్న అధికారం

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో కలుపబడిన ప్రాంతం విషయంలో 1358 ఫసలీ హైద్రాబాదు సేల్సు ఆఫ్ మోటారు స్పిరిట్ టాక్సేషన్ రెగ్యులేషన్‌క్రింద కమీషనరు నిర్వహించు అధికారాలను రెవిన్యూబోర్డు నిర్వహించగలదు.

## కొల్లారీ నియమావళి

1956 సంవత్సరపు ఆంధ్ర కొల్లారీ చట్టంలోని 19 వ సెక్షను ననుసరించి 1957 సంవత్సరపు ఆంధ్ర కొల్లారీ నియమావళి 1957 జనవరి 23వ తేదీనాటి అసాధారణ గెజెట్‌లో ప్రకటింపబడింది.

## జాతీయ పొదుపు పక్షం

చిన్న మొత్తాల పొదుపు ఉద్యమాన్ని బహుళంగా వ్యాప్తిలోకి తెచ్చి ఎక్కువ ధనాన్ని సేకరించే ఉద్దేశంతో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమంతటా 1957 జనవరి 17 వ తేదీ నుంచి జాతీయపొదుపు పక్షం జరుపబడింది. ఈ పక్షం రోజులలో వివిధ ప్రచార సాధనాల ద్వారా, చిన్నమొత్తాల పొదుపు కొరకై ఏర్పాటు చేయబడిన నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్లు నేషనల్ ప్లాన్ సర్టిఫికెట్లు, ట్రెజరీ సేవింగ్స్ డిపాజిట్లు, 15 ఏండ్ల ఆన్యూయిటీ సర్టిఫికెట్లు, పోస్టాఫీసు సేవింగ్స్ బ్యాంకు మొదలగు వాటికి పెట్టుబడి పెట్టవలసిందిగా ప్రజలను ప్రోత్సహించడ మైనది.

## పాఠశాలల పుస్తకములు

రిజిస్టరైన పుస్తక ప్రకాశకులు ప్రాథమిక పాఠశాలల కొరకు పాఠ్యపుస్తకాలను దాఖలు చేయవలసిన ఆఖరు తేదీ 1957 ఫిబ్రవరి 28నుంచి మార్చి 11వ తేదీవరకు పొడిగించబడింది.

## సంఘ సంక్షేమం

పూర్వపు ఆంధ్ర రాష్ట్రంలోని వెనుకబడిన తరగతులు, విముక్త జాతులు మొదలగువారి సంక్షేమం కొరకు 1955-56 సం.లో తగు కృషి జరుపబడిందని సంఘసంక్షేమ శాఖ వారి వార్షిక నివేదికవల్ల తెలుస్తున్నది.

1947 సంవత్సరపు మద్రాసు పౌర అనర్హతల తొలగింపు (సవరణ) చట్టం, 1947 సంవత్సరపు దేవాలయ ప్రవేశాధికారచట్టం, 1955 సంవత్సరపు అస్పృశ్యతా (నేరముల) చట్టంలోని నిబంధనలను రాష్ట్రమంతటా గట్టిగా అమలుపరచిన ఫలితంగా అస్పృశ్యతను చాలా వరకు నిర్మూలించడానికి అవకాశం కలిగింది.

చలికాలపు సెలవుల్లో హైద్రాబాదు భారత్ సేవక్ సమాజ్ వారు 1956 డిసెంబరు 22 వ తేదీ మొదలు 1957 జనవరి 4 వ తేదీవరకు విద్యార్థి యువజన శిబిరాలను ఏడింటిని నిర్వహించారు.

హైద్రాబాదుకు సమీపమునవున్న హిమాయత్‌సాగర్‌లో 1957 జనవరి 21 వ తేదీనుంచి 30 తేదీవరకు సహాయ కేడెట్‌దళం, కార్మిక, సంఘసేవాశిబిరం నిర్వహింప బడింది. ఆ శిబిరంలో పదిమంది ఉపాధ్యాయులు, 491 మంది కేడెట్లు ఒక గ్రామానికి అప్రోచ్‌రోడ్లు వేశారు.

హైద్రాబాదు నగరంలోని పబ్లికుగార్డెన్సులోవున్న బాలల గ్రంథాలయాన్ని 1956 డిసెంబరునెలలో 1956 మంది దర్శించారు.

రాష్ట్రప్రభుత్వ ప్రధాన కార్యదర్శి జనవరినెలలో నల్లగొండ, వరంగలు, ఖమ్మం జిల్లాలలో మొత్తం 400 మైళ్ళు పర్యటించి గ్రామీణాభివృద్ధి కృషిలో నిమగ్నులై వున్న బ్లాకు ఆఫీసర్లకు సామాజికాభివృద్ధి ప్రాజెక్టులు, జాతీయవిస్తరణ సేవాకేంద్రాల పరమార్థాన్ని వివరించారు.

## వస్త్ర పరిశ్రమ

1947 వ సం. పు పారిశ్రామిక వివాదాలచట్టం నిమిత్తమై ఆంధ్రప్రదేశ్‌లో టెక్స్‌టైల్ పరిశ్రమ ఈ ప్రకటన అధికార గెజెటులో ప్రకటితమయ్యే తేదీమొదలు ఆరునెలల వరకు ప్రజోపకరమైన సర్వీసుగా ప్రకటించబడింది.

## నీటితీరువ మినహాయింపు

రాయలసీమ ప్రాంతంలో ప్రభుత్వ మరియు ప్రైవేటు తోపులలో వేయబడు చెట్లపై(వంటచెరకుగా ఉపయోగ పడునవి)పచ్చిఆకు ఎరువుపై నీటితీరువమినహాయింపుకు సంబంధించిన ఉత్తర్వు 1366 వ ఫసలీ వరకు పొడిగింపబడినవి. మొదట సదరు మినహాయింపు 1952 మే 21 వ తేదీన మంజూరు చేయబడి తిరిగి 1954 నవంబరు 6 వ తేదీన 1364, 1365 వ. ఫసలీలవరకు పొడిగింపబడినది.

## సిమెంటు ప్యాకింగ్ చార్జీలు

1957 జనవరి 1 వ తేదీతో ప్రారంభమై 1957 మార్చి 31 వ తేదీతో అంతమయ్యే కాలానికి సిమెంటు ప్యాకింగు చార్జీలను సరిసమాన రేటుప్రకారం టన్నుకి రూ. 13-2-0ల చొప్పున నిర్ణయించారు. ఈచార్జీ కొత్త జనపనార సంచులలో నింపబడిన సిమెంటుకు మాత్రమే వర్తిస్తుంది. పాత సంచులలో నింపబడిన సిమెంటు చార్జీలను విక్రయదారు, కొనుగోలుదారు మాట్లాడుకొని నిర్ణయించుకోవాలి. అయితే ఆ విధంగా నిర్ణయించుకొనే చార్జీ టన్ను 1 కి రూ. 13-2-0 లకు మించరాదు.

## కర్నూలు - కడపకాలువ

అత్యవసరమైన మరమ్మతుల నిమిత్తమై కర్నూలు - కడపకాలువ సుంకేశలవద్ద హెడ్‌స్లూయిస్‌నుంచి కడప జిల్లాలోని దాని చివరవరకు 15-1-1957 తేదీ సాయంత్రం 6 గంటలనుంచి పూర్తిగా మూసివేయబడినది. ఈ కాలువ మళ్ళీ 30-6-1957 తేదీ సాయంత్రం తరువాత తెరువబడుతుంది. కాలువ మూసివేయబడు పై తేదీ ఏ స్థితిలోనూ మార్పుచేయబడదు. మూసివేయబడిన కాలంలో సాగుకు, ఇతర అవసరాలకు నీరు సరఫరాచేయబడదు. నీరు లభించని కారణంగా పైరు లేమైనా నష్టపడినట్లయితే ఆ బాధ్యత ప్రభుత్వానిది కాదని ప్రజలకు తెలియజేయబడినది.

## ఎంప్లాయిమెంట్ సర్వీసు

ఎంప్లాయిమెంటు ఎక్స్‌చేంజీల వ్యవస్థ రాష్ట్రప్రభుత్వానికి మార్పు చేయబడిన ఫలితంగా "డిపార్టుమెంట్ ఆఫ్ రీ సెటిల్మెంట్ అండ్ ఎంప్లాయిమెంటు" అని ఆ శాఖకు ఇంతవరకు వున్న పేరుకు బదులుగా ఇకనుంచి దానిని "స్టేట్ డైరెక్టరేట్ ఆఫ్ నేషనల్ ఎంప్లాయిమెంటు సర్వీస్" ఆంధ్రప్రదేశ్, హైద్రాబాదు అని వ్యవహరించడానికి నిర్ణయింపబడినది.

## రాష్ట్ర రవాణాపాలకవర్గం

ప్రభుత్వం రాష్ట్ర రవాణా పాలకవర్గము నొకదానిని ఏర్పాటు చేసింది. అందులో ఈ దిగువవారు సభ్యులుగా వుంటారు. 1. ట్రాన్సుపోర్టు కమీషనర్ (అధ్యక్షుడు) 2. చీఫ్‌ఇంజనీర్, హైవేస్ 3. పోలీసు డిప్యూటీ ఇనస్పెక్టర్ జనరల్ (సి. ఐ. డి., రైల్వేలు)

## మాజీ సైనికులకు గ్రాంట్లు

వికలాంగులై నిస్సహాయ స్థితిలోవున్న 29మంది మాజీ సైనికులకు, వారిపై ఆధారపడివున్న వారికి సహాయం చేసే నిమిత్తమై ఇండియన్ సోల్జర్సు బెనివొలెంట్ ఫండ్‌బోర్డు వారు 1957 జనవరి 11వ తేదీన జరిగిన తమ సమావేశంలో మొత్తం రూ. 2,538/-లు గ్రాంటుగా ఇచ్చారు.

## మోటారు స్పిరిట్ అమ్మకములపన్ను చట్టం

అసిస్టెంట్ కమర్షియల్ టాక్సు ఆఫీసర్ హోదాకు తక్కువగానట్టి వాణిజ్యపన్నులశాఖ ఆఫీసర్లు అందరూ వారి వారి అధికారావరణలలో 1939 సంవత్సరపు మద్రాసు

మోటారు స్పిరిట్ అమ్మకముల పన్ను చట్టం యొక్క 9 (1) సెక్షన్‌వల్ల సంక్రమించిన అధికారాలను చెలాయించ డానికి ప్రస్తుతం హక్కు కలిగివున్నారు. వాణిజ్య పన్నుల చట్టంక్రింద పన్ను ఎగవేతలను పట్టుకోవడానికై నియమిం పబడిన ఇనస్పెక్టర్లుకూడా ఆ అధికారాలను చెలాయించ డానికి అనుమతిఇస్తూ ఇప్పుడు ప్రభుత్వం ఉత్తర్వుచేసింది.

## పారిశ్రామిక వివాదాలు

ఈక్రింది పారిశ్రామిక వివాదాలు తీర్పు నిమిత్తమై హైద్రాబాదులోని పారిశ్రామిక న్యాయస్థానానికి నివేదించ బడినవి.

1. విజయవాడలోని శ్రీ గోపాలకృష్ణ ట్రాన్సుపోర్టు కంపెనీ లిమిటెడ్ యజమానులకూ, ఆకంపెనీలో పనిచేసే కండక్టరుకుమధ్య యేర్పడినతగాయిదా. ఇందులో కండక్టరు తరపున మోటారు వర్కర్సు యూనియన్‌వారు ప్రాతినిధ్యం వహిస్తారు. కండక్టరును 6-1-1956 తేదీనుంచి కంపెనీవారు సస్పెండుచేసిన కారణంగా ఈ తగాయిదా ఏర్పడింది.

2. గుంటూరుజిల్లా నరసరావుపేట లారీ యజమాని శ్రీ కోటిలింగంకూ ఆయన లారీ డ్రైవరుకూ మధ్య ఏర్పడ్డ తగాయిదా. డ్రైవరు తరపున నరసారావుపేట డివిజన్ మోటారువర్కర్సు యూనియనువారు ప్రాతినిధ్యం వహిస్తారు. డ్రైవరును పనినుంచి తీసివేసిన కారణంగా ఈ తగాయిదా ఏర్పడింది.

3. గుంటూరుజిల్లా తెనాలిలోని శ్రీ కృష్ణాలంచ్ హోం యజమానులకూ, ఆ లంచ్‌హోంలో పనిచేసే వ్యక్తికిమధ్య యేర్పడ్డ తగాయిదా. పనిచేసే వ్యక్తి తరపున తెనాలిపట్టణ హోటలు వర్కర్సు యూనియనువారు ప్రాతినిధ్యం వహిస్తారు. ఆ వ్యక్తిని పనినుంచి తీసివేసిన కారణంగా ఈ తగాయిదా ఏర్పడింది.

4. విజయనగరం వాయుపుత్ర బస్ సర్వీసు యజమానులకూ, కార్మికులకూ మధ్య ఏర్పడ్డతగాయిదా. సర్వీసు యజమానులు ముగ్గురు పనివారలను రిట్రెంచి చేసిన కారణముగాను, తొమ్మిదిమంది పనివారలను తిరిగి పనిలోనికి తీసుకొనుటకు నిరాకరించిన కారణంగాను ఈ తగాయిదా ఏర్పడినది.

## జైళ్ళ ఇన్‌స్పెక్టర్-జనరల్

1956 సంవత్సరపు రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ చట్టము ననుసరించి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో చేర్చబడిన ప్రాంతం విషయంలో 1956 నవంబరు 1 వ తేదీ లగాయితు ఈ ఈ క్రింది ఏర్పాట్లు చేయబడినవి.

జైళ్ళ ఇన్‌స్పెక్టర్-జనరల్ 1951 సంవత్సరపు హైద్రాబాదు పిల్లల చట్టం క్రింద సర్టిఫైడ్ స్కూళ్ళ చీఫ్ ఇన్‌స్పెక్టరుగాను, 1954 వ సంవత్సరపు హైద్రాబాదు జైళ్ళ చట్టం క్రింద ఇన్‌స్పెక్టర్ జనరల్‌గాను, 1956 సంవత్సరపు హైద్రాబాదు బోర్‌స్టల్ స్కూళ్ళ చట్టం క్రింద ఇన్‌స్పెక్టర్ జనరల్‌గాను అధికారములను చెలాయించగలరు.

## పంచాయితీల సంఖ్యాబలం

జనాభా ప్రాతిపదికపై ఎన్నుకొనబడవలసివున్న పంచాయితీల సంఖ్యాబలాన్ని ప్రభుత్వం ప్రకటించింది. ప్రతి సందర్భంలోను సంఖ్య మొత్తంలో స్త్రీ సభ్యురాలు చేరిలేదు. 20 వేలు లేక అంతకంటె ఎక్కువ జనాభాగల పంచాయితీలో 16 మంది సభ్యులుంటారు. 15 వేలు మొదలు 20 వేల వరకు జనాభాగలపంచాయితీలో 15 మంది సభ్యులుంటారు. 12 వేలు మొదలు 15 వేలువరకు జనాభాగల పంచాయితీలో 14 మంది సభ్యులుంటారు. 10 వేలు మొదలు 12 వేలవరకు జనాభాగల పంచాయితీలో 13 మంది సభ్యులుంటారు. 7,500 మొదలు 10,000 వరకు జనాభాగల పంచాయితీలో 11 మంది సభ్యులుంటారు. 5 వేలు మొదలు 7,500 వరకు జనాభాగల పంచాయితీలో 9 మంది సభ్యులుంటారు. 2,500 మొదలు 5,000 వరకు జనాభా గల పంచాయితీలో 8 మంది సభ్యులుంటారు. 1000, 2,500 మధ్య జనాభా గల పంచాయితీలో ఏడుగురు సభ్యులుంటారు. వెయ్యికంటె తక్కువజనాభాగల పంచాయితీలో ఆర్గురు సభ్యులుంటారు.

## జాతీయ పతాకం

కొందరువ్యక్తులు, సంస్థలు చిన్నచిన్నకాగితపు జాతీయ పతాకాలను తయారుచేసి విక్రయిస్తున్నట్లు ప్రభుత్వ దృష్టికి తేబడింది. ఈవిధంగా చేయడం జాతీయ చిహ్నమైన జాతీయ పతాక గౌరవాన్ని చులకన చేయడ మవుతుంది. కనుక ఇంతవరకూ ఈవిధంగా కాగితపు జాతీయ పతాకాలను తయారుచేసి విక్రయిస్తున్న ప్రయివేటు వ్యక్తులు, సంస్థలు ఆపనిని మానుకోవలసినదిగా కోరడమవుతున్నది. ప్రజలుకూడా ఆవిధంగా చేయకూడదని కోరబడుతున్నారు.

## సాధారణ అమ్మకపుపన్ను చట్టం

మద్రాసు సాధారణ అమ్మకపుపన్ను (ఆంధ్ర రెండవ సవరణ) చట్టం, 1956, రాష్ట్రంలో 1956 డిసెంబరు 31వ

తేదీనుంచి అమలులోనికి వచ్చింది. ఆ తేదీనాడే అది రాష్ట్ర అసాధారణ గెజెట్‌లో ప్రకటింప బడింది.

## మశూచి నిరోధానికి రక్షణ చర్యలు

వేసవి ప్రారంభంతో టీకాలు వేయించుకోనివారికి మశూచి వస్తుంది. హైదరాబాదు మునిసిపలు కార్పొరేషను టీకాలు – దానికి చేసిన యేర్పాట్లను నగర ప్రజలు వినియోగించుకోవాలి. హైదరాబాదు నగరంలోని అన్ని ఔషధశాలలు, ఆస్పత్రులలో టీకాలువేసే వుద్యోగులు ఏర్పాటుచేయబడ్డారు. వీరు ఉదయం 10-12 గంటలమధ్య పనిచేస్తారు. మునిసిపలు శిశుసంక్షేమ కేంద్రాలలోను, మునిసిపల్ శానిటరీఇన్‌స్పెక్టర్ల కార్యాలయాలలోను వారు ఉదయం వేళ, మధ్యాహ్నం బాలా ప్రొద్దుపోయిన తరువాతకూడా వుంటారు. నగరంలో ఆయా ప్రాంతాలలోకూడా టీకాలు వేయబడతాయి. తామున్నచోటనే టీకాలు వేయించు కొన గోరువారు ఆ విషయాన్ని మునిసిపల్‌కార్పొరేషన్ ఆరోగ్య సిబ్బందికి, ఆ వార్డు శానిటరీ ఇన్‌స్పెక్టరుకూ, అసిస్టెంటు వైద్యాధికారికీ తెలియపరచవలెను.

## అబ్కారీ చట్టం

ఎక్సైజుశాఖ ఇన్‌చార్జిగాఉన్న రెవెన్యూ బోర్డు సభ్యుడు 1316 వ ఫసలీ హైదరాబాదు అబ్కారీ చట్టం (1316 ఫసలీ హైదరాబాదు చట్టం 1) క్రింద ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో కలుపబడిన ప్రాంతంలో ఎక్సైజు కమీషనరు అధికారాలను నిర్వర్తించగలడు. ఆయన 1333 వ ఫసలీ హైద్రాబాదు మత్తుపదార్థాల చట్టం (1333 ఫసలీ హైద్రాబాదుచట్టం4) క్రింద 'చీఫ్ ఇంటాక్సికేటింగ్ డ్రగ్స్ ఆఫీసరు' బాధ్యతలనుకూడా నిర్వహించగలరు.

## పరీక్షల వార్తలు

1957 సంవత్సరపు హెచ్. యస్. సి; హెచ్. యస్. సి. టెక్నికల్ వార్షిక పరీక్షలు పూర్వపు హైద్రాబాదు రాష్ట్రంలోని తెలంగాణా, మరాట్వాడా, కర్నాటక ప్రాంతాల 17 జిల్లాల్లో 1957 మార్చి 20 తేదీనుంచి ఆరంభం కాగలవు.

సంగీత భూషణ్ సర్టిఫికెట్‌కోర్సు యొక్క ప్రభుత్వ పరీక్షను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖ (సాంకేతిక విద్య) 1957 ఫిబ్రవరిలో ఈ క్రింది విభాగములుగా జరుపుతుంది. 1. హిందూస్తానీ గాత్ర సంగీతం. 2. కర్ణాటక గాత్ర సంగీతం. 3. సితార్, 4. కర్ణాటక ఫిడేలు, 5. కథక్ నృత్యం, 6. భరతనాట్యం.

బార్ కౌన్సిలు పరీక్షలు 1958 మార్చిలో హైద్రాబాదులో జరుగగలవు.

కర్నూలులోని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంకేతిక పరీక్షల డిప్యూటీ కమీషనరు సివిల్ మెకానికల్, ఎలక్ట్రికల్ ఇంజనీరింగు విషయాలలో జరుపు సాంకేతిక పరీక్షల కొరకై హైద్రాబాదులో ఒక పరీక్షాకేంద్రం నెలకొల్ప బడింది.

1957 సం. నుంచి ఇంటర్మీడియెట్ ఆర్ట్సు బి. ఏ. పరీక్షలకు కూర్చొనే అభ్యర్థులు ఆప్షనల్ క్లాసికల్ లాంగ్వేజెస్ క్రింద చేయవలసిన అనువాదపు పేరాను ఇంగ్లీషులోకి గాని లేదా హిందూస్తానీలోకిగాని ఏ లిపిలోనైనా వ్రాసి చేయవచ్చునని ఉస్మానియా విశ్వవిద్యాలయ రిజిస్ట్రారు తెలియ జేస్తున్నారు.

తెలుగు, మరాటీ, కన్నడములలో జరుగు విద్యాశాఖ యొక్క ప్రాంతీయ భాషా పరీక్షలు (హైయ్యర్‌గ్రేడ్, లోయర్‌గ్రేడ్) ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగాణా జిల్లాల కొరకై 1957 ఏప్రిలులో హైద్రాబాదు నగరంలో జరుపబడ గలవు.

దేరాడూన్‌లోని సైనిక స్కూలు (పూర్వం దీనినే ప్రిన్స్ ఆఫ్ వేల్సు మిలిటరీ కాలేజి అని వ్యవహరించేవారు) లో ప్రవేశం కొరకై ఆంధ్రప్రదేశ్ అభ్యర్థులకు పరీక్ష 1957 మార్చి, 18, 19 తేదీలలో హైద్రాబాదులో జరుపబడ గలదు. పరీక్షలో లిఖిత పరీక్ష, మౌఖిక పరీక్ష వుండగలవు.

## పైరు పంటలు

పూర్వపు ఆంధ్రరాష్ట్రంలో 1956 సెప్టెంబరు 25 వ తేదీ వరకు 295,300 ఎకరాలలో ప్రత్తిపంట వేయబడినట్లు అంచెనాలు తెలుపుతున్నవి.

1956 నవంబరునెల ఆఖరువరకు చేరిన నివేదికనుబట్టి ఆంధ్రప్రదేశ్‌లోని చెరకుపంట పరిస్థితి కొంతవరకు సంతృప్తికరంగానే వున్నట్లు తెలుస్తున్నది. కాని శ్రీకాకుళం, కృష్ణా, చిత్తూరు జిల్లాలలో అధిక వర్షాలవల్ల పంట దిగుబడి కొంత తగ్గవచ్చునని తెలుస్తున్నది. అయితే పశ్చిమ గోదావరి జిల్లాలోని తణుకులో కొత్తగా చక్కెర మిల్లు స్థాపించబడినందు చేతను, చెఱకు విత్తనం వేసే రోజుల్లో చెఱకు ధరలు హెచ్చుగావుండి పరిస్థితి ఆశాజనకంగా వుండటంచేతను కృష్ణా, పశ్చిమ గోదావరిజిల్లాలలో ఎక్కువ భూమిలో చెఱకుపైరు వేయబడినట్లు తెలుస్తున్నది. కాలమాన పరిస్థితి బాగా వుండడంచేత నిజామాబాదు

జిల్లాలో పంట దిగుబడి ఎక్కువగా వుండవచ్చునని ఆశించ బడుతున్నది.

1956 డిసెంబరునెల ఆఖరువరకు చేరిన నివేదికనుబట్టి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని ముఖ్యపంట అయిన వరికోతలు అన్ని జిల్లాలలో జరుగుతున్నట్లు తెలియవచ్చింది. అన్ని జిల్లాలలో పంట సాధారణంగా వుండగలదని అంచెనా వేయబడుతున్నది. అయితే కృష్ణా, చిత్తూరు, నెల్లూరు, కడప, పశ్చిమ గోదావరి, కర్నూలు జిల్లాలలో మాత్రం పంట సాధారణంకంటె కొంచెం తక్కువగా వుండగలదని భావింప బడుతున్నది. కృష్ణాజిల్లాలో వరి పీకపురుగువల్ల పైరు దెబ్బతిన్నదని తెలుస్తున్నది. నెల్లూరు జిల్లాలోని కొన్ని ప్రాంతాలలో పైరు మరొకరకం పురుగు వల్ల, వర్షాలవల్ల దెబ్బతిన్నది. కడపజిల్లాలో అధిక వర్షాల వల్ల దెబ్బతిన్నది. పశ్చిమ గోదావరిలో తెగుళ్లవల్ల దెబ్బ దెబ్బతిన్నది. తెంగాణా ప్రాంతంలో ఒక్క ఖమ్మం జిల్లాలోతప్ప మిగతా అన్ని జిల్లాలలో నాట్లువేసే తరుణంలో కాలమాన పరిస్థితి బాగా వుండడంవల్ల ఎక్కువ భూమిలో వరిపైరు వేయబడిందని నివేదిక తెలుపుతున్నది.

ఆంధ్రప్రదేశ్‌లో పొగాకు పండించబడే జిల్లాలలో 1956-57 సంవత్సరంలో, పొగాకుపైరు వేయబడిన భూమి అంచెనాలు తెలియ వచ్చినవి. ఈ అంచెనాల ప్రకారం 25-12-1956 తేదీ నాటికి తెలంగాణా ప్రాంతంలోను, తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలోను, నెల్లూరు జిల్లాలోని కందుకూరు తాలూకా లోను మొత్తం 264,200 ఎకరాలలో పొగాకుపైరు వేయ బడింది. (1, 07, 594 ఎకరాలలో వర్జీనియా పొగాకు, 96, 606 ఎకరాలలో నాటుపొగాకు వేయబడింది) గత సంవత్సరం ఇదేకాలంలో పొగాకుపైరు వేయబడిన భూమితో పోల్చి చూచినట్లయితే ఈ సంవత్సరం పైరు వేయబడిన భూమి 11శాతం హెచ్చుగావున్నట్లు తెలుస్తున్నది.

## రవాణా ఆపరేటర్లు

రెండవ పంచవర్షపు ప్రణాళికలో రోడ్డురవాణా అభివృద్ధి దృష్ట్యా, రోడ్డురవాణా సర్వీసులను జాతీయం చేయవలసిన దృష్ట్యా యోగ్యమైన కొన్ని యూనిట్లకు ఎక్కువలో ఎక్కువ ఐదేళ్ళ కాలంవరకు పర్మిట్లనుఇచ్చి అట్టి యూనిట్లను ప్రత్యేకంగా ప్రోత్సహించ వలెనని తలపెట్ట బడింది. హైద్రాబాదు రీజనల్ ట్రాన్సుపోర్టు అధారిటీ క్రిందగల సరుకుల రవాణా ఆపరేటర్లు అట్టి యోగ్యమైన యూనిట్లను ఏర్పాటు చేసుకొని ఈ అవకాశంవల్ల లాభం పొందవచ్చును.



# దేశంతో పాటు మీరు కూడా అభ్యుదయం పొందండి!

## మీరు మిగుల్చుకున్న డబ్బును భారత ప్రభుత్వ చిన్న మొత్తముల పొదుపు పథకంలో పెట్టుబడి పెట్టండి!

*భారత దేశం యొక్క*

సామాజికాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్పనదీలోయ ప్రాజెక్టులకు, రైలుమార్గములు రోడ్ల అభివృద్ధికి సహాయపడండి!

*మీ డబ్బును ఈ క్రింది గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!*

| | |
|---|---|
| 12 సంవత్సరముల నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు | మెచ్యూరిటీ పొందినమీదట నూటికి ఏడాదికి 4.16 వంతుల చొప్పున వడ్డీ లభిస్తుంది. రూ. 5 లవి మొదలు రూ. 5,000 ల వాటివరకు ఈ సర్టిఫికెట్లు లభించును. వ్యక్తిగతంగా రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| 10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు | ప్రతియేటా నూటికి 3½ వంతుల చొప్పున వడ్డీ చెల్లించబడుతుంది. రూ. 100 లవి మొదలు రూ. 25,000 లవి వరకు లభిస్తాయి. వ్యక్తిగతంగా రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| 10 సంవత్సరముల జాతీయ ప్రణాళిక సర్టిఫికెట్లు | మెచ్యూరిటీ పొందిన మీదట నూటికి ఏడాదికి 4½ వంతుల చొప్పున వడ్డీ చెల్లించబడుతుంది. 5 రూ. లవి, 10 రూ. లవి, 25 రూ. లవి, 50 రూ. లవి, 100 రూ. లవి, 500 రూ. లవి ఇవ్వబడును. వ్యక్తిగతంగా రూ. 25,00 ల వరకు కొనవచ్చును. |
| పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంట్లు | డిపాజిట్లపై రూ. 10,000 ల వరకు నూటికి 2 వంతుల చొప్పున వడ్డీ చేర్చబడుతుంది. శేషముపై రూ. 15,000 ల వరకు నూటికి 1½ వంతుల చొప్పున వడ్డీ చేర్చబడుతుంది. |
| 15 సంవత్సరముల ఆన్యూటీ సర్టిఫికెట్లు | నూటికి ఏడాదికి 3½ వంతుల చక్రవడ్డీతో నెలసరి కిస్తులుగా 15 ఏండ్ల లోపున తిరిగి చెల్లించబడుతాయి. జారీచేయబడు ధరలు: రూ. 3,500, రూ. 7,000, రూ. 14,000 రూ. 28,000 వ్యక్తిగతంగా రూ. 28,000 ల వరకు కొనవచ్చును. |

## ఆదాయపు పన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది!

## భారతదేశ ఉజ్జ్వల భవిష్యత్తుకొరకై పెట్టుబడి పెట్టండి!

ఇతర వివరములకు, ఈ పెట్టుబడులకు సంబంధించిన నియమావళికొరకు:

**నేషనల్ సేవింగ్సు కమీషనర్, సిమ్లా చిరునామాకు గాని లేక రీజనల్ ఆఫీసరు, హైదరాబాదు (దక్కన్) చిరునామాకు గాని వ్రాయవలెను.**



రిపబ్లిక్ దినోత్సవంనాడు ఫతేమైదాన్‌లో బాలల విన్యాస ప్రదర్శనం.



బాలల విన్యాస ప్రదర్శనంలో మరొక దృశ్యం.

